# భర్గ శతకములు

లోకనము - యతి గవేషణము)





కపిలవాయి లింగమూర్తి

**DURGA BHARGA SATAKAMULU:-** A poem on Rhetoyic & Prosody, concurrently c ing two prayers, addressed to Goddess Durga a Bharga, each prayer consisting of hundred verses-by Sri Kapilavayi Lingamurthy, Nagarl Mahboobnagar Dist.

---

ప్రతులు : 1000



ప్రథమ ముద్రణ : 1984

**వెల : 5-00**

ప్రతులు దొరకు చోట్లు :

1. M. శేఖరరెడ్డి B.O.L.
   Post. రాకొండ
   Tq. అచ్చంపేట తాలుకా, మహబూబునగరం జిల్లా.

2. కె. కిశోరుబాబు
   15-34 వాణీసదనం
   నాగర్‌కర్నూలు-509209.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ - హైదరాబాద్.

నేను ఓరియంటల్ పరీక్షలలో అడుగుపెట్టి కావ్యలక్షణాలు చదువుకునే దినాలలో ఆలంకారాలపై అభిమాన మేర్పడింది. బహుశః అవి నా ప్రవృత్తికి సరిపోయినవేమో, అన్నిటికంటె వానిపై ఎక్కువ శ్రద్ధను కేంద్రీకరించినాను. చంద్రాలోకం చదివే అపుడు అవే లక్ష్యాలు కొంచెం ఇటుఅటుగా చేసి కూర్చితే ఒక చిన్న కథగూడా ఏర్పడింది. అపుడు నాకు వానితో ఒక శతకం వ్రాస్తే కొత్త ప్రయోగంగా ఉంటుందనే ఊహ పొడమింది. పిమ్మట నరస భూపాలీయ ప్రతాపరుద్ర యశోభూషణాలు చదివినాను. అపుడు గూడ నా కలంకారాలపైననే ఎక్కువ దృష్టి. కేవలం ఉపమా భేదాలతోనే ఒక కందశతకం వ్రాయవలె నను కొన్నాను కాని అవన్నీ ఊహల్లోనే ఉండిపోయినవి.

ప్రాచ్య కళాశాలలో ఉపన్యాసకునిగా చేరిన పిమ్మట రెండవ ఏట విద్యార్థులకు అప్పకవీయం, నరస భూపాలీయం చెప్పవలసివచ్చింది. అపుడు వారికి యతి ప్రాస విశేషాలు తెలిపే అందుకు ప్రతిపద్యం ఆ దృష్టిలో చూడ వలసి వచ్చేది. మనకు కావలసిన ప్రయోగాలన్నీ పద్యాలలో ఉండవు గదా ! అంతేగాదు అన్ని పాదాలలో గూడ ఉండవు.

అప్పకవిగారు స్వయంగా అత్వవళి - ఇత్వవళి - ఉద్విరామము అని స్వరవళులకు, ప్రాణి విరామములు-మవర్ణ విరామములు-హకారసంధి అని కొన్ని హల్విరామాలకే గాని అన్నిటికి లక్ష్యాలు వ్రాయలేదు. అతడెంత లాక్షణికుడో అంతటి కవి గనుక ఆయన అన్ని యతులకు స్వయంగా ఉదాహరణలు వ్రాసి ఉంటె అవి ఎంత మనోహరంగా ఉండేవో!

అప్పకవీయం చెప్పే దినాలలో ఆ పద్ధతిలో ఒక శతకం కూర్చితే బాగుండునని తోచింది. కావ్యాలంకార సంగ్రహంలో అలంకారాలు గూడ అపుడు చెబుతున్నాను. కాబట్టి పూర్వోక్త సంకల్పం బయటికి వచ్చి, నాలో ఈ రచనకు అంకురార్పణ జరిగింది.

ఈ శతకం లక్ష్య జిజ్ఞాసువుల నుద్దేశించింది కనుక పద్యం చిన్నదిగా ఉండవలె. వీలైనంత వరకు యతి స్థానంలో ప్రాచీన కవుల ప్రయోగాలే నిలుపవలె. పద్యం నాలుగు పాలదాలో అప్పకవిగారి స్వరవళుల వలె ఒకే పళికి ఉదాహరణం ఉండవలెనని నిశ్చయించుకున్నాను.

మా తాలూకాలోని ప్రాచీన క్షేత్రం ఉమామహేశ్వరం కనుక ఈ శతకం అక్కడి దేవతల స్తుతిరూపంగా ఉండవలెనని, ఉమాదేవి త్రిపురసుందరి గనుక అలంకార శతకంలో ఆమె సౌందర్యలీలలు, శివుడు యోగీశ్వరుడు కనుక యతి శతకంలో అతని మహిమాలీలలు, వర్ణించవలె ననుకొన్నాను. ఆటవెలది స్త్రీ నామం గనుక దాన్ని ఉమాదేవి స్తుతికి, గీతంలోని మరొక భేదమైన తేటగీతిని శివస్తుతికి ఎన్నుకున్నాను.

వీటిలో దుర్గా శతకాన్ని శతంపై నవసంఖ్యతో భర్గశతకాన్ని శతంపై రుద్రసంఖ్యలో ముగించినాను.

యతి శతకంలో సంఖ్యా పూరణం కొఱకు అప్పకవిగారి ప్రాణి విరామ మవర్ణ విరామాదుల వంటివి కొన్ని రెండేసి పద్యాలుగా గూడ మార్చినాను. యతి ప్రాసల విశేషాల కొఱకు ఆంధ్ర కావ్య సముద్రాన్ని మథించి అనర్ఘమైన రత్నాలను బయటపెట్టిన మంథరాయ మాణులు శ్రీ రావూరి దొరసామిశర్మగారు. వారి తెలుగు ఛందోరీతులు నాకీ శతకానికెంతో ఉపకరించింది కనుక వారికి నా ప్రథమ కృతజ్ఞతలు.

వరాన్వేషణం — కవి ఆడపిల్లల తండ్రివంటి వాడు. తన కృతికన్య నెవరైనా యోగ్యుల కీయవలెనని తివురటం లోకసహజం. ఎవరూ దొరకనప్పు డిష్టదైవా లున్నారు. అది వేరుమాట.

పెండ్లికి ఆలస్యమైతే ఆడపిల్ల అపవాదు పడుతుంది. ప్రచురణ కాలస్యమైతే కవిగారి పద్యా లితరుల కావ్యాలలోనికి దూరిపోతవి. అందువల్ల నేను ప్రథమ ధర్మాన్ని పురస్కరించుకొని ఈ శతకాల కొరకిద్దరు ముగ్గురిని పలుకరించి చూచినాను. వారు సరేనన్నంత పనిచేసి చివరకు తుస్సుమన్నారు. లాభనష్టాలు బేరీజు వేసికొన్నారేమో !

ఒక కవికి లేదా కావ్యానికి ఆర్థిక సహాయం చేస్తే లోకంలో దానివల్ల వచ్చే నికరమైన లాభం ఏముంటుంది గనుక ఇక తన్మూలకమైన పుణ్యం లేదా యశస్సు అనేది దేవతల కన్నులకు తప్ప మనుష్యుల కండ్లకు కనిపించేవి గావు కాబట్టి ఆ కనిపించని ఆకాశ వాయుపదార్థాలీనా డెవరికవసరం. ఏదైనా భౌతికంగా కనిపించేది లేదా ఆర్థికంగా లాభించేది కావలె ఆ రెండూ కానిదాని విషయం దేవుడెరుగు తక్కిన వారికి పట్టదు అని నా అవస్థను చూసి మిత్రరూపంలో వచ్చిన ఒక మహానుభావుడు తారకోపదేశం చేసినాడు. దానితో నేనూరడిల్లి తక్కిన వాని స్థానంలో దీన్ని చేర్చినాను. అయితే సంగతి తెలిసిన వాడెవాడైనా ఎక్కడైనా ఒక్కడున్నాసరే తనదృష్టిలో పడిన అపూర్వ విషయాన్ని విడిచి పెట్టడు; ఏలాగైనా సాధింప జూస్తాడు యథాలాపంగా విడువడు. ఇపుడీ శతకాల విషయంలో అక్షరాలా అదే జరిగింది.

ఈ కృతి ప్రకాశకుడు దీన్ని తమ తలిదండ్రుల స్మృతిచిహ్నంగా అచ్చు వేయిస్తానన్నాడు. పదవిరీతిగా నేనుపన్యాసకుడిని. ఇతడో సామాన్యో పాధ్యాయుడు. నాకంటె దిగువ పీఠంలో ఉన్నప్పటికీ నేను చేయలేని పని తాను చేస్తానని ముందుకు వచ్చినాడు. కార్యసాధకునికి ద్రవ్యంగాదు ప్రధాన కారణం. దానికి తగిన హృదయ సంస్కారంగావలె.

ఇతని పేరు శేఖరరెడ్డి; ఇంటిపేరు మల్లేపల్లివారు. మల్లేపల్లి నేడు దేవరకొండ తాలూకాలోని గ్రామం. దాన్ని శక. 1157 జయసంవత్సర కార్తీకబహుళ దశమి గురువారంనాడు కందూరి భీమదేవ చోడమహారాజు అచ్చంపేట తాలూకాలోని ఉమా మహేశ్వరానికి దానం చేసినట్లు అక్కడొక శాసనం ఉంది కాబట్టి మరి యింటి పేరుకు కారణమైన గ్రామం అదే కావచ్చును. అక్కడి నుండి బయలుదేరిన వీరి వంశం ఈ ప్రాంతంలో చాలా గ్రామాలలో వ్యాపించింది. ఈ ప్రస్తుత వంశానికి మూల పురుషుడు సంజన్నగారు.

వంశవివరం - సంజన్నగారు మొదట పందుగలలో గున్నదొరల గాదెపై ఉన్నాడు. గున్నవారుగూడ రెడ్లే. ఆకాలంలో రాకొండలో కొత్తపల్లి వారనే రెడ్లున్నారు. వారి ప్రాంతానికి గిరికొత్తపల్లె నుండి వచ్చినారట. వారి యింటిపేరు దొంతి రెడ్డివారు. ఒకప్పుడు రాకొండ రెడ్డిగారు పందుగుల దొరగారి దగ్గరకు ఏదో పనిపై వెళ్ళగా ఆతనికి సంజన్న కంటబడినాడు. అప్పటికతనికింకా పెండ్లిగాలేదు. తనకు

కూతురున్నది. అందుచేత సంజన్న గుణగణాలు నచ్చి తన యింటికి తీసికొని వెళ్ళినాడు.

సంజన్న అప్పటికే కొంత ఈడు ముదిరినవాడు. రెడ్డిగారింటికి తీసికొని వెళ్ళినాడు గాని అతడు యజమానిగారి భార్యకు నచ్చలేదు. విషవృక్షమైనా పెట్టినచేత పెరుకరాదు గాబట్టి రెడ్డిగారిరుకటంలోబడి సంజన్నను తమ పశువుల దొడ్డిపై ఉంచినాడు. స్వకులస్థుడైనా యజమాను రాలతనిని పెట్టిపోతల దగ్గర పశువులకాపరికంటె ఎక్కువగా చూడలేదు; కాని అదృష్ట లీలలు విచిత్రంగా ఉంటవి. అవి సంజన్నకు ధాన్యాగారం పైనుండి పశువుల దొడ్డికి, వరిమెతుకుల నుండి జొన్నసంకటికి వచ్చినాననే భావం కలుగ నీయలేదు.

కాళికాదేవిముందు బలిపీఠంపై కూర్చున్న జడభరతునికి ఆ దేవిలోను, తనను చంపనున్న వ్యక్తిలోను, అతని చేతి కత్తిలోను అన్నింటా విష్ణు రూపమే కనిపించిందట. అలాగే సంజన్నకు గాదె-దొడ్డి-అన్నం-అంబలి-రెండొకే తీరుగా కనిపించినవి. అతనిలోని కార్యతత్పరత కొన్ని దినాలకు యజమాను రాలి మనసు మార్చివేసింది. దానితో ఒక సుముహూర్తంలో అతడాయింటికి ఇల్లటపల్లుడైనాడు. అప్పటికతనికి దాదాపు నలువదేండ్లు. సమావర్తనం పొంది గృహస్థుడైన వటువువలె సంసార బాధ్యత స్వీకరించినాడు. అతనికి రామయ్య చిన్నయ్య అనే యిద్దరు కుమారులు కలిగినారు. వ్యవహారంలో రామయ్య పెద్ద వాడుగా, చిన్నయ్య చిన్నవాడుగనే ఉన్నారు.

రాకొండలో రంగినేనివారనే వెలమ దొరలున్నారు. వారక్కడికి జినకుంటనుండి చేరినశాఖ. ఆ వంశీయులది వేపర్ల. అక్కడినుండి చెలమయ్య గారను వ్యక్తి జినకుంటకు వచ్చెనట. అతనికి ముగ్గురు కుమారులు. వారిలో పెద్ద వాడు తిమ్మయ్యగారు. అతని కారుగురు. వారిలో పాపయ్యగారనే వ్యక్తి రాకొండకు చేరినాడు. అప్పటికా ప్రాంతపు గ్రామాలన్ని గున్నదొరల ఆధీనంలో ఉన్నవి.

రాకొండ జినకుంట మొదలైన అచ్చంపేట తాలూకా గ్రామాలన్ని పూర్వం నిజంబాదలోని గున్నరెడ్లకు చెందినవి. వారిచేతనే రంగినేనివారు జిన కుంట చెన్నవరం మొదలైన గ్రామాలు మఖ్తాలుగా పొందినారు. ఆ మఖ్తాలు క్రీ.శ. 1948 వరకు నడిచినవి.

రామయ్యగారు తమ గ్రామంలోని దొరగారికి కుడిభుజంగా ఉండి వారి చేత నలుబది ఎకరాల మఖ్తా సంపాదించుకున్నాడు. అంతేగాక తన తండ్రిగారి నుండి సంక్రమించిన దొడ్డిని బాగా అభివృద్ధి చేసినాడు.

నూరేండ్లు బ్రతికినా చావుతప్పదు, వేయేండ్లు బ్రతికినా వేరు తప్పదని తెలుగువారి సామెత కాబట్టి రామయ్య చిన్నయ్య సోదరులు చివరి దశలో విభాగమైనారు. అవిభక్త కుటుంబాలలో పెత్తనందార్లు చివరినాటి కేదో మెలిక పెట్టి తమ భాగం కొంత ఎక్కువగా గిట్టించుకోవటం కద్దు. కనుక రామయ్య ఏవేవో తాకట్లు ముందువేసి దొడ్డిఅంతా తన మూలంగానే వృద్ధి అయిందని భాగంలో కొన్ని ఆవు లెక్కువగా తీసుకున్నాడు.

విభాగం అయినపుడు సోదరులాస్తి పంచుకోగలరే గాని అదృష్టాన్ని పంచుకోలేరు. ఆ నమ్మకంతో ఉన్న చిన్నయ్యగా రన్నగారితో పోరాడలేదు. కాని అన్నగారితో నీవు అన్యాయంగా ఆవు లెక్కువగా తీసికుంటున్నావు గనుక ఇది నీకు అభివృద్ధికరంగాదు అన్నాడు.

మానవు లందరు మహర్షులు కారుగాని ఒరులచేత నిజంగా మనస్సుకు బాధ కలిగినపుడు వచ్చినమాట మాత్రం నిజంగా శాపమే అవుతుంది. అందు చేత చిన్నయ్యగారు పలికిన మాట తరువాత రామయ్యగారి వంశం మాత్రం నిజంగానే అభివృద్ధి పొందలేదు. ఆయనకు శాయన్న లింగయ్య అనే యిద్దరు కుమారులు గలిగినారు.

శాయన్న తిండికిగాని పనికిగాని భీముడు. గంపెడు శీతాఫలా లవలీలగా ఫలహారము క్రింద ఊదివేసేవాడు. పూటకు తవ్వెడు జొన్నల సంకటి, బుట్టెడు బుడుమకాయల కూర హరహరా అనేవాడు. ఇక బలంమాటకు వస్తె ఎంతలేసి పొగరు గిత్తనైనా తరిమి చెవి మెలివేసి నిలిపేవాడు. ఎంతటి పోట్ల పసరమైనా కొమ్ముపట్టి నిలదీసేవాడు. ఎంతటి పెంకె పసరమైనా మోటగట్టి వెనక్కు నడిపించేవాడు. అది అతని ప్రజ్ఞ. రెండెద్దుల పగ్గం తిరగని మాను నొక్కు గొడ్డలితో ఒక్కచేత పడవేసేవాడు. ఇతనికి ఒకే ఒక కూతురు కలిగింది. ఆమె పేరు పుల్లమ్మ.

శాయన్న లోకంలో ఇంత బలవంతుడు కావటమేమిటి, సంసారంలో అతనికి ఒకే ఒక కూతురు కలుగటమేమిటి? చిత్రంగదా !

శాయన్న తమ్ముడు లింగయ్యకు మల్లయ్య చంద్రయ్య అనే యిద్దరు కొడుకులు కలిగినారు. మల్లయ్యకు రత్నమ్మ అనే కూతురు కలిగింది. చంద్రయ్యకు ప్రథమ కళత్రానికి సంతానము కలుగలేదు. పిమ్మట గజ్జెలమ్మ అనే మరొకామెను చేసుకున్నాడు. చివర కతనికి మొదటిభార్య ఎల్లమ్మకు మాత్రమే ఒక కూతురు కలిగింది. ఈ విధంగా చిన్నయ్య మాట రామయ్యగారి వంశంలో రెండోతరం నాటికి ఫలించింది.

చిన్నయ్య భార్యపేరు ఎల్లమ్మ. ఆ దంపతులకు మల్లయ్య, కాశన్న, లక్ష్మయ్య అని ముగ్గురు కుమారులు కలిగినారు మల్లయ్య పెద్దవాడైన పిమ్మట ఒకప్పుడు మునాయిటి కాలంలో పొలం దున్నుతుండగా పిడుగుపడి మరణించినాడు. అప్పటి కతనికి రాగయ్య రాగమ్మ అని యిద్దరు సంతానం. తండ్రిలేని ఆ పిల్లలను మేనమామగారు తమ యింటికి తీసికొని వెళ్లినాడు. అతనిది దెంది చింతపల్లి. రాగయ్యగారి వంశం ఇపుడక్కడ ఉంది.

చిన్నయగారి రెండవ కుమారుడు కాశన్న. ఆయన భార్య గౌరమ్మగారు. ఈ దంపతులు స్థారక నాములుగా కనిపిస్తారు. తెలుగులో ''కాసంత'', ''కాసింత'' అని కాసు అల్పార్థంలో కనిపిస్తుంది కాబట్టి పేరుకు తగినట్లు కాశన్న ఉరఫ్ కాసన్న పొట్టిగా ముత్తెమంతవాడై ఉండగా గౌరమ్మ గట్టంతమనిషి. అయినప్పటికి ఆమె వినయం అణకువ చూడదగినట్లుగా ఉండేవి. ఆ బృహత్కాయంలో ఈ అణకువ ఏవిధంగా ఒరిగిందో అని చూపరుల కబ్బురం కలిగేది. ఈ దంపతులకు నారాయణరెడ్డి, వెంకట నరసారెడ్డి, చిన్నారెడ్డి అని ముగ్గురు కుమారులు కలిగినారు. వారిలో నారాయణరెడ్డికి ఎనిమిదిమంది సంతానం. వెంకట నరసారెడ్డికి బాలకిష్టారెడ్డి అనే కుమారుడు గలిగినాడు. చిన్నారెడ్డి నిస్సంతుగా గతించినాడు.

కాశన్న సోదరుడు లక్ష్మయ్యకు కాశిరెడ్డి, నరసింహారెడ్డి, ముత్యాలరెడ్డి అనే కుమారులు కలిగినారు.

కాశిరెడ్డి శతాధికజీవి-నూటా అయిదేండ్లు జీవించినాడు. అత
నారాయణరెడ్డి, లింగారెడ్డి, లక్ష్మారెడ్డి అనే కుమారులు కలిగినారు
సోదరుడు నరసింహారెడ్డి యిల్లరికంగా వెల్లటూరికి,ముత్యాలరెడ్డి బ్రతు
లట్టిపల్లికి వెళ్లినారు.

ఈ వంశంలో లట్టిపల్లి ముత్యాలరెడ్డి పేరుకు తగినవ్య
లోకజ్ఞుడు. సాహిత్యప్రియుడు. మరియు భక్తుడు. అతనికి తమ వ
అంతా కరతలామలకంగా ఉండేది. ఈయన పూర్వ పురుషాయుష జీ

సమర్థునికి ఎక్కడా ఏదీ ఆసాధ్యం గాదు అనటానికి అత
ఒక నిదర్శనం. ఇంటి దగ్గరి ఆస్తినంతా పాలివారికే విడచి,
నూటెనిమిదెకరాల పొలం సంపాదించుకున్నాడు.

ముత్యాలరెడ్డి గారివలె ఈ వంశంలో మరో చెప్పదగిన వ్య
కుమారుడు నారాయణరెడ్డిగారు. ఆయనలో శాయన్నగారి బలసంపద
రెడ్డిగారి విజ్ఞానసంపద రెండూ కలిసి ఉండేవి. అతడు గ్రామంలోని
ఒక నికారసైన ప్రతిపక్ష సభ్యుడుగా ఉండేవాడు గాని, వారితో
విరోధించలేదు. ఈయన భార్యపేరు బాలమ్మ. ''బాల'' తెలుగువారు బ
సుందరికి పొట్టిగా మలుచుకున్న సంకేతం.

నారాయణరెడ్డిగారిని ఆయన భార్యను గురించి ప్రజలు
చెప్పుకుంటారు:

సారాచార విచారుడు
ధర గుణుఁడు కుటిల తిమిర తిగ్మాంశుఁడు గం
భీరుఁడు శిష్టాచారుఁడు
నారాయణరెడ్డి మనుజ నారాయణుఁడే.
వ్యర్థము సేయఁడు వేళ ని
రర్థకమగు వాదములకు నరుగఁడు గురువా
క్యార్థము మరువఁడు జగతి కృ
తార్థుఁడు నారాయణాఖ్యుఁడగు రెడ్డియనన్.

రాకొండను తనకుం బ్రతి
రాకుండును "ఏసులోసు" రాకుండ కొలల్
రాకుండ నడకలో సరి
రాకుండన్ కాపురాన రాణించెను తాన్.
ఆతనిసతి బాలాంబిక
శ్రీతరుణియె లక్షణమునఁ జెప్పఁగనేలా
ఆ తన్వి పుట్టినిల్లుగ
దా! తలపగ సంద్రమంత దనియంద్రు జనుల్.

రెడ్డిగారికి పురాణజ్ఞానం కూడా ఉండేది. ఆయనగారి కారణగురువు తెలక పల్లె నివాసి గన్నోజు అంతయ్యగారు. ఆయన త్వష్టబ్రహ్మ వంశీయుడు. మేడి పూరు జోగయ్యగారి శిష్య పరంపరలోనివాడు.

జోగయ్యగారికి మా ప్రాంతంలో అపర బ్రహ్మంగారని ప్రసిద్ధి. ఆయన సిద్ధపురుషుడు. అతని దిక్కడ ఒక ప్రత్యేక సంప్రదాయం గూడ ఉంది. ఆయన శిష్యులంతా అచల మార్గానికి చెందినవారు. సంసారులైన ఈ గురుశిష్య పరంపర ఉపాసించే అచలం శాంకరుల యొక్క బ్రహ్మమే. అయితే ఆది శంకరులు సాకార రూప దేవతలను గూడ మన్నించి స్తుతించినారు గాని వీరెట్టి దశలో గూడ వారి నంగీకరించరు.

నారాయణరెడ్డికి అంతయ్యగారిపై గురి ఎక్కువ. రెడ్డిగారి పొలంలో పంట బాగా అతుక కుండేది. అది తెలిసి అంతయ్యగారు తానే స్వయంగా ఒక్క పర్యాయం నారాయణరెడ్డిగారి దగ్గరకు వచ్చి ఆయన పొలంలో "భూలక్ష్మీ దేవిని" నిలిపి పొలాన్ని పంటముఖంగా చేసినాడు.

యోగ్యుడనిపించిన వారికి మంత్రాన్ని అడుగకున్నా ఈయవలెనని సత్సంప్రదాయం. తన పొలం పంటముఖం కావటంతో నారాయణరెడ్డిగారికి అంతయ్యగారిపై మరింత భక్తి విశ్వాసం కుదిరింది. ఆయనతో కారణం పొంది నాడు. ఆ తరువాత అతనికి అధిమనశ్శక్తి వికసించింది. దానితో అతడు తన వారికెన్నో సూటి మాటలు చెప్పినాడు. అటువంటి తండ్రిగారి తపఃకోటి ఫలం ఈ కృతి ముద్రాపకుడు. ఇది అతని వంశవివరం.

ఈ వంశంలో రామన్నగారు నలువది ఎకరాలు మళ్ళా సంపా
చెప్పినాను. అది మొదట గూడ మల్లేపల్లి వారిదే. సంజన్నగారి కంటె
అక్కడ మరొక వంశం ఉండేది. కాలాంతరంలో అది నామావశిష్టమై
దొరలకు చేరింది. దానిలో నామ మాత్రమైన ఒక బావి గూడ ఉండే
మేకవాని బావియని పేరు. రామయ్యగారికి దొర లదే భూమిని మళ్ళా
నారు. రామయ్య అది పొందిన తరువాత బావిని బాగుచేయించి ద
తెట్టెను కట్టించినాడు.

పూర్వం చెలుకలకు ''జాగా'' లని పేరు. అది ఈనాటి స
వంటిది. ఒక పర్యాయం దాని ఎల్లలు నిర్ణయమైతే యిక చెరిగేవికావు
తరంలో అవి ఖండికలైనా అవన్నీ మొదటి పేరుతోనే పిలువబడేవి
లోని మొదటి మల్లేపల్లి వారి పొలం రామయ్యగారు వచ్చేనాటికే తున
యొక్క కొంతభాగం దొరల చేతిలోనే ఉండిపోయింది. దాన్ని వారు
యం వేరువేరు వారికిచ్చేవారు. అయితే దైవికంగా ఆ తునకను చేసే
వీరితో విరోధంగానే ఉంటూ వచ్చేవారు. ఆ విరోధాన్ని తొలగించ
నారాయణరెడ్డిగారి వరకు ఎవరికీ వీలు గాలేదు. వారు ఎల్లప్పుడు ఏ
పెడుతూ ఉండటం చూసి నారాయణరెడ్డిగారిది మా పొలానికి సం
గనుక ఏలాగైనా మళ్ళీ కలుపుకోవాలని తలచి సమయం కోసం వేచిన
డూరికి తిరుమల రావుగారు పోలీసు పటేలుగా ఉన్నాడు. ఆయన పొల
పెద్ద తుమ్మ చెట్లున్నవి. అవి కొట్టించి బండి చేయించవలెనని అతని

ఆయనకు అవసరం వచ్చినపుడు పని వారిలో పందెం కల్పి
చేయించుట ఒక సరదా! అందుచేత ఒకనా డతడు తన వారితో
''మా పొలంలోని రెండు తుమ్మలను ఒకే చేతితో పడగొట్టగలిగేవా
అన్నాడు. అపుడెవరో నారాయణరెడ్డిగారైతె సమర్థుడు అన్నారు.
వెంటనే ఆయన్ని పిలిపించినాడు. మాటల నడుమ పౌరుషం పొడు
పందెం ఖాయమయింది. నిర్ణీతదినమంనా డతడుషోదయంలో లేచి
తెమ్మని చెప్పి గొడ్డలి భుజాన పెట్టుకొని వెళ్ళి మధ్యాహ్నం వరకు వా
పాటిదాన్ని పడవేసి, అంబలి త్రాగి పశువులు మళ్ళేవరకు రెండోద
యింటికి వచ్చినాడు.

తెల్లవారే వరకు దొరగారికి విషయం తెలిసింది. నారాయణరెడ్డిగారిని పిలిచి, పందెం నెగ్గినందుకు ఏం కావాలో కోరుకో అన్నాడు. రెడ్డిగారపుడు నాకు మరేదీ వద్దు. మా పొలానికి సంబంధించిన తునక ఎప్పటికీ మాకే ఉండే అట్లు యిప్పించండి అని అడిగినాడు. రెడ్డిగారు పందెం నిలుపుకున్నాడు గాబట్టి దొరగారు గూడ తన మాట నిలుపుకోవలసి వచ్చింది. ఆ విధంగా అతను చిరకాలంగా తమ ప్రక్కనున్న ఒక శల్యాన్ని తొలగించుకున్నాడు. ఇది ఆయన కార్యదక్షతకు ఒక ఉదాహరణంగా ఊరివారు చెబుతారు.

అతనికి ఎనమిది మంది సంతానమని చెప్పినాను. కిష్టమ్మ, రత్నమ్మ, రామిరెడ్డి, లక్ష్మారెడ్డి, రామేశ్వరమ్మ, హనుమంతరెడ్డి, కాశిరెడ్డి, శేఖర్‌రెడ్డి- ఇది వారి జన్మక్రమం.



శేఖరరెడ్డి దంపతులు

నేను జాతీయ పాఠశాలలో పనిచేసే అపుడు శేఖర్‌రెడ్డి అక్కడ విద్యార్థి, నా క్రింద చదివి నన్నభిమానించేవారిలో ఒకడు. అయితే నేనతనిని ఇందుకు గాక చిన్నతనంలోనే జీవితంలో పొందవలసిన అనుభవాలన్నీ పొంది ఒక స్థిరమైన హృదయం కలవాడైనందుకు మెచ్చుతాను. క్రిందటేడు 21-5-93 నాడు అతని కూతురి పెండ్లి జరిగింది. ఆమెను తమకు సమీపంలోని రాళ్ళపల్లెకు యిచ్చినారు. ఆ వివాహము నిశ్చయమైన తరువాత ఆకస్మికంగా అతనికి కనిష్ఠ పుత్రికా వియోగం కలిగింది. ఇటువంటి సందర్భంలో మరొక చోటైతే ఆ

వివాహం వాయిదా పడేదే కాని యితడు దాన్ని ఆ విధంగా కానీయ లేదు. ఏ విధంగా వివాహం నిర్ణీత దినానికే జరిపించినాడు. లోకంలో వివాహం క సంతోషం, మృత్యువు కంటె దుఃఖం ఉండవు గదా! ఆ రెండింటిని ప్ర ప్రక్కగా సహించటం అతని హృదయంలోగల సుఖదుఃఖ సమభావనకు ఉదాహరణం.

ఇతని స్వగ్రామం రాకొండ. దానికి ఱాతికొండ, రాముని కొండ రెండర్థాలున్నవి. పేరుకు తగినట్లుగా ఊరికి తూర్పున పెద్ద రాతిగుట్ట ఉ చుట్టుపట్ల గ్రామాలకన్నిటికి ఉపయోగపడుతుంది. దానిపై చోళులనాటి పురా మైన ఒక ఆలయంగూడ ఉంది. చిహ్నాలను బట్టి అది విష్ణ్వాలయంగా తోస్తు పూర్వం దానిలో లక్ష్మీనారాయణ ప్రతిష్ఠ ఉన్నట్లు వదంతి. ఇపుడు మా ఏ దైవమూ లేకపోగా ఇతడే దానిలో యిటీవల ఒక శివ ప్రతిష్ఠ చేయించినా

మా గ్రామం జినుకుంట. ఈ గ్రామాని కాగ్నేయంగా మైలున్న ఉంటుంది. దాని పేరుకుగూడ జీలుగుకుంట జినకుంట, అని రెండు వ్యు లున్నవి.

శేఖర రెడ్డికి రుక్మాంగదుడు, హైమవతి, మల్లికార్జునుడు, మల్లీశ్వరి నలుగురు సంతానం. అతనికీ శతకాలను గంటించి తెలిసినప్పటినుండి నెప్పుడు తమ తలిదండ్రుల స్మృతి చిహ్నంగా బయటికి తెత్తునా అని చూస్తున్నాడు.

లోకంలో ప్ర వారు తమ తండ్రి ఋణం ఏదో విధంగా తీర్చుకో అందుకు వారి స్మృతి చిహ్నంగా గుడులెత్తించేవారు, గోపురాలు గట్టించే దైవ ప్రతిష్ఠలు జేయించేవారున్నారుగాని, సాహిత్యంలో స్మారక స్తంభాలు వారరుదు, మానవుడేదైనా సత్కార్యం చేస్తే అతని ఏడు తరాల పూ తరిస్తారట అది మనం చూడలేం గాని ఏవో ఒక విశేషంతో వారు స్మరింప తుంటే ఆ జీవులు తరించినట్టే లెక్క. అయితే గతించిన వారి స్మరణ త్యంలో ఎంత ఉదాత్తంగా జరుగుతుందో అన్యత్ర అంతగా జరుగదని మా చెప్పవచ్చు.

ఇతడు క్రిందటేడు కూతురి వివాహం చేసినాడు. అంతవరకతనికి మూడు నాలుగేండ్లనుండి కాలం సహకరించలేదు. అదిగాక ఏదీ ఒక సందర్భం గూడ కలిసిరాలేదు. కాబట్టి సమయం కోసం చూస్తున్న తాను నా దగ్గరకు వచ్చి అన్ని వ్యయాలలో ఇదీ ఒకటి కనుక ఏదైనా ఒక పద్దును కోసియైనా ఈ శత కాలను బయటికి తెస్తానన్నాడు.

మన యిండ్లలో శుభకార్యాలు ఏవో సందడులు జరగడం మామూలే. ఆ సందర్భంలో జరిగే ఖర్చులుగూడ మామూలే. కాని, సాహసం చేసి అన్నిటితో పాటు ఇదీ ఒకటి అని ఆ సందర్భంలో సాహిత్యారాధనవైపు మొగ్గుచూపే హృదయ సంస్కారం ఎందరికుంటుంది కనుక ? కాని ఈ కాలంలో ఆడపిల్ల పెండ్లి మాటలుగాదు. దానికితోడు మరో బరువొకటి ఎందుకెత్తుకుంటావని నేనే వారించి, అతని కూతురుని అల్లుని —



నరసింహారెడ్డి హైమవతి

1. శ్రీకరమని మన్మధుని వ
శకర శర తూణియని వసింప దలచియున్
చేకొనె రసాలపురినే
ప్రాకటుఁడీ దంపతులకు భవికం బిడుతన్.

2. నరహరి రూపము దాల్చిన
హరువున కోనాగ కొండయతివను శ్రీగా
కరమొప్ప జేసికొను శ్రీ
హరి యీ దంపతుల కెప్పు డభయం బిడుతన్.

3. హైమవతీ నరసింహుల
కామితములు దీర్చుగాక కంజాక్షుడు తా
నేమిటఁ గొరంత లేకను
శ్రీ మహిమా స్ఫూర్తులిచ్చి చిరకాలంబున్.

4. ఈ కల్యాణము కరుణా
లోకనముల గూర్చినట్టి లోకాధిపులున్
నాకాధిపులును సతతము
శ్రీకర కామితము లిడుత చిరకాలంబున్.

అని దీవించినాను. ఇప్పుడు మళ్ళి కుమారుని వివాహ సందర్భం వచ్చిం
కానాపురం సర్పంచు రాఘవరెడ్డిగారి కూతురి నిస్తున్నారు.



రాఘవరెడ్డిగారు

రాఘవరెడ్డిగారిది అప్పాజిపల్లె. ఆ గ్రామంలో కుప్పిరెడ్డి నరసింహారెడ్డి గారు ప్రసిద్ధుడు. ఊరిలో ఒక హనుమదాలయం, ఒక శివాలయం కట్టించినాడు. ఎందరో పేదవారికి పెండ్లిండ్లు చేసినాడు. ఆయనకు నారాయణరెడ్డి, చిన్నారెడ్డి, రాఘవరెడ్డి, రామచంద్రారెడ్డి అని నలుగురు కుమారులు; రామచంద్రమ్మ, రామేశ్వరమ్మ, రాములమ్మ, కాంతమ్మ అని నలుగురు కూతురులు కలిగినారు.

నరసింహారెడ్డిగారి సోదరి పుల్లమ్మను కానాపురం లోని రాతాసి వారింటికి బాల్‌రెడ్డిగారి కిచ్చినారు. అతడు అనపత్యంగానే గతించినాడు. స్త్రీలకుండే మాతృత్వ కాంక్ష చెఋపరానిది. అందుచేత ఆమె నడింపల్లినుండి సగోత్రీకుడైన నరసింహారెడ్డిగారి బిడ్డలు సింహారెడ్డి, అమృతమ్మ అనే వారిని తెచ్చుకొని పెంచి పెద్దజేసి అమృతమ్మను శాయనిపల్లెకు యిచ్చింది. సింహారెడ్డికి తన అన్నగారి కూతురైన రామచంద్రమ్మను తెచ్చి వివాహం చేసింది. ఆ దంపతులకు బాల కిష్టమ్మ, జానమ్మ అని యిద్దరు కూతురులు కలిగినారు. పురుష సంతానం కలుగలేదు.

పుల్లమ్మ గారికి తనచేత పెంచిన మొక్కకు మగ మొలకలు కలుగక పోవటం మనసు కుదరలేదు. అందుచేత అన్నగారి మూడవ కుమారుడైన రాఘవరెడ్డిని తెచ్చుకొని, అతనికి సింహారెడ్డి గారి కూతురు బాలకిష్టమ్మను వివాహం చేసింది. ఈ కారణంగా రాఘవరెడ్డి తమ గ్రామం అప్పాజిపల్లెను విడచి కానాపురం కాణాచిగా చేసికోవలసివచ్చింది.

తండ్రిగారైన నరసింహారెడ్డిగారిలోని దైవభక్తిని, ఆత్మ జిజ్ఞాసను పెద్దవాడైన నారాయణరెడ్డిగారు పంచుకుంటె, ఆయనలోని వ్యవహార దక్షతను, సౌజన్యాన్ని రాఘవరెడ్డిగారు పంచుకొని పుట్టినా రనవలె. అందుకాయన ఆ గ్రామానికి సర్పంచ్ కావటమే ఒక నిదర్శనం.

సులోచన, సుధాకర్, సువర్ణ, సింహారెడ్డి, జ్యోతి, అరుణ అనేవారు ఆయన సంతానం. వారిలో మూడవ సంతానం సువర్ణయే ప్రస్తుత వధువు. శేఖర్‌రెడ్డి వచ్చి నాకీ విషయం వినిపించి ఇప్పుడిక శతకం బయటికిరాక తప్పదన్నాడు.

కుమారుని వివాహం - ఆ సందర్భంలో శతకావిష్కరణ - వార్తలు విని నేను ఇనుమడించిన సంతోషంతో ఆ దంపతులనిలా దీవించి



రుక్మాంగదరెడ్డి-సువర్ణ

శ్రీరస్తున్ శుభమస్త
న్నారట రాకొండ లక్ష్మినారాయణుడున్
కూరిమితోడను కానా
పూరున చెన కేశవుండు పొరి మీ ప్రీతిన్.
తలప సువర్ణము రుక్మం
బులు నొకటే యైనరీతి భూమిని మీరల్
లలి నేకాత్ములుగా మని
కులమున నాదర్శమగుడు కూరిమి యందున్.
ఇరువురు చదువున వయసున
సరికి సరై నిలిచినట్టి సరసులు గానన్
అరుదుగ నొకటొక టొకరై
బరగు నటుల్ కాపురాన వరలుడు మీరల్.
బంగారు గువ్వజంట హా
రంగులు చెలువారగాను రాగము లొలుకన్
మంగళమయ మగు మార్గము
నం గలసి చరించు డమలినంబగు పథమున్.

మామ శేఖరుండు మహిత సుభద్ర మీ
యత్తగారు కాపురాన నీకు
కొదువ లొదువ వెల్ల కోర్కులు నిండుగా
బండు సుమి సువర్ణ ! ఫలము లగుచు
పూర్ణ పురుషులు నవతార మూర్తులిట్లు
దంపతులుగాగ నైరన దనరుసట్టి
వారు మీ యత్త మామలు వాసిపరులు
నీకు రుక్మాంగదా ! యిక నేమి కొదవ !

అని ఆ వధూవరులను దీవించినాను.

సందర్భం ఇది అయినా శేఖర్ రెడ్డి దీన్ని తమ తలితండ్రి స్మృతిగా వెలువరిస్తున్నాడు. వారిని గురించి పైనే చెప్పినాను కాబట్టి యిక్కడ యిక 'ఏవంవిధ గుణఖనికిని' అని షష్ట్యంతాలు పలుకను గాని-

1 ఆగమ ప్రత్యయమున నిన్నునుటె గాని
నలుపొ తెలుపో యెఱుంగనీ కలుగురూపు
గురువు లభిమాను లాప్తులం గూడినపుడు
నీవా కడవున్న వనుధ్యాస నిట్ట వొడుచు.

2 పండితుడు గాని నాచేత పలుకజేతు
వేలనో ఈ కవిత్వంబు దీననేమి
యైన లవలేశ సుకృతంబు నందువేని
అద్ది యీ కృతి స్మృతిపతు లందుకొనని-

అని ఈ శతకంలో ప్రస్తుతింపబడిన పార్వతీ పరమేశ్వరులను ప్రార్థిస్తున్నాను.

స్వస్తి

ఇట్లు
సాహిత్యారాధకుడు
కపిలవాయి లింగమూర్తి

# మకుటం

ఇవి లక్షణ శాస్త్రానికి సంబంధించిన పద్యాలు గనుక పాఠకుల శించి వీలైనంత చిన్న పద్యంలో లక్ష్యం చూపవలె ననేది నా లక్ష్యం. అ పాదానికి అర్ధపాదానికి సరిపడే మకుటం గాకుండా ద్వ్యక్షర పరిమితమైన ఎన్నుకున్నాను. అయితే హరి-హర-రమ-ఉమ-వంటి అల్పాక్షరాల మన వాఙ్మయంలో మిక్కిలిగనే ఉన్నవిగదా! వీనినే ఎందుకు ఎన్నుకు మిత్రులు శ్రీ రంగాచార్యగా రడిగినారు.

పోతనగారు దుర్గాదేవి ఎట్టిదొ, ఏవేవి ప్రసాదిస్తుందో ''అమ్మల యమ్మ''లో చెప్పినాడు. నేను నేర్చుకున్న నాటికా పద్యం ఎవరిదో తె కాని ఆ తల్లి చదువులు సిస్తుందని గురువులు చెప్పటంవల్ల ప్రార్థనలో చద వారం. భాగవతం చేత పట్టుకున్న తరువాత అది పోతనగారి పద్యమ తరువాత చాలా కాలానికి దానిలోని మహత్వ కవిత్వ పటుత్వ సంపద గారు ''ఓం ఐం హ్రీం శ్రీం'' అనే దుర్గా మంత్ర బీజాక్షరాలు ని నాడని తెలిసింది.[1]

దుర్గాదేవి మాహాత్మ్యం దేవీభాగవతంలోని సప్తశతిలో విపులంగా బడింది. దానికి దుర్గాసప్తశతి అని మరో పేరు. అది సప్తశతి ఏ కాలేదో-మరేవిధంగా అవుతుందో శ్రీ జోస్యం జనార్దన శాస్త్రిగారు-

మం- ఐమ్-హ్రీమ్-క్లీమ్-చాముండాయైవిచ్చే

శ్లో॥ దుర్గేస్మృతా హరసి భీతి మశేష జంతో
స్వస్థైస్మృతా మతిమతీవ శుభాం దదాసి
దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా

అనే వానిని కాదినవ సూత్రంతో లెక్కించి చూపినారు[2]. ఇక భర్గుని

---

1. పోతన్నగారి సహజ పాండిత్యం - తుమ్మలమల్లి రామలింగేశ్వ గారు. పే. 43.
2. చూ. భారతి-జూలై-77-పే-49.

ఓం భూపర్భుస్సువః తత్సవితుర్వరేణ్యమ్
భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్.

అని బ్రహ్మోపదేశం చేసిన ఆచార్యులు వివరించినారు కనుక ఈ విధంగా నా భావనా ప్రపంచంలో తెలియకుండానే ఈ పేర్లు నిలిచిపోయినవి. అవిపుడు పలికించిన స్తుతిరూపాలే ఈ శతకాలు.

శతకం అన్నపుడు నూరు పద్యాలే ఉండవలె. పూర్వులు శత-సహస్ర-లక్ష-కోటి సంఖ్యావాచకాలను ఒక పూర్ణత్వానికి సంకేతంగా ఎంచుకున్నారు.

పెద్ద వారెవరినైనా దీవించవలసి వచ్చినపుడు "నిండా నూరేండ్లు బ్రతుకు నాయనా!'' అని అంటే-పురోహితులు —

పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం
నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం
భవామ శరదశ్శతం ... ... ... ... ...

"... ... శతమనంతం భవతి - శతమైశ్వర్యం భవతి శతమితి శతం దీర్ఘమాయుః'' అని అక్షతలు వేస్తారు. ఇక మనం విరాట్పురుషుని నుతించినపుడు ''ఓం సహస్రశీర్షాః పురుష సహస్రాక్ష సహస్రపాత్తని-అనంత కోటి యుగధారిణేనమః'' అని చేసే స్తుతుల్లో ఆయాసంఖ్యలు గణితానికంటే పూర్ణత్వాన్నే ఎక్కువగా సూచిస్తవి. అయితే కొన్నచోట కొసరువలె పూర్ణాంకంపై మళ్ళీ జుట్టెందుకు ?

ఒకసత్కార్యం ముగిసినపిమ్మట అది అక్కడకే ఆగటం ప్రాచీనుల మతమైనట్లు తోచదు. ఆలయాలలో ప్రధానార్చన ముగిసినపిమ్మట పూజారి మళ్ళీ పునః పూజ నారంభించి విడుస్తాడు. పౌరాణికుడు గ్రంథం పూర్తి అయితే మళ్ళీ మొదలెత్తుకొని ఆపుతాడు. అతిథికి భోజనవేళలో యిల్లాలు ఎంతగా వద్దన్నా మారు వడ్డించకుండా ఊరుకోదు. ఇంటికి వచ్చిన బంధువు మళ్ళీ రాకున్నా వెళ్ళే అపుడు ''పోయివస్తా''ననటం ఆచారం - వీనినిబట్టి నాళ్లీలం కీర్తయేత్తన్నట్టు సదారంభంగూడ సర్వదా వర్ధిల్లుతుండవలెనని పూర్వుల

ఆకాంక్ష యైనట్లు తెలుస్తుంది కాబట్టి ఈ సంప్రదాయమే గణిత శాస్త్రంలోగూడ ప్రవేశించిందేమో! అందుచేతనే పూర్ణాంకాలపై ఎనిమిది-పదహారు మొదలైన సంఖ్యలు నిలిచిన వనిపిస్తుంది.

మన సంఖ్యాశాస్త్రంలో ఒక్కొక్క అంకెకు, లేదా సంఖ్యకు ఒక్కొక్క ప్రాధాన్యం ఉంది. నూరేండ్లు బ్రతికినవాడు ఆపైన మరో పదారేండ్లకు వేద కాలంనాడే కృషిచేసినాడని ''నూరు–నూటపదారు''లో ఆచార్య తిరుమలగారు తెలిపినారు[1] కనుక ఈ సంఖ్యల విషయంలో ఎవరి నమ్మకాలు వారివి. కన్నడ ప్రాంతీయులు నూటిపై ఒక్కటికి ప్రాధాన్యమిస్తే వైష్ణవులు ఎనిమిది సంఖ్యకు ప్రాధాన్యమిస్తారు.

నేనీ శతకాలకు మొదటి దానిలో నూటిపై ''దుర్గా'' సంఖ్యఅని తొమ్మిదిని, భర్గా శతకంలో రుద్రసంఖ్య అని పదకొండును గ్రహించినాను. ఇంతకు పూర్వం రచించిన పాండురంగ విట్ఠల, తిరుమలేశ శతకాలలో దివ్య తిరుపతుల సంఖ్యఅని నూటెనిమిదిని పాటించినాను. ఆర్యా శతకంతో నూటపదారు పద్యాలు వ్రాస్తే ఒక మిత్రుడు "ఇదియెట్లా'' గని అడిగినాడు. దాన్ని నేను మిత్ర మణికి యిచ్చినాను కాబట్టి మిత్రుని సంఖ్యఅని నూటిపై పదారును నిలిపినాను. ఇక యిప్పుడీ శతకాలు మీముందుంచుతున్నాను. వీటిని చూసి నా ప్రయత్నంలో నేనెంతవరకు కృతకృత్యుడ నయింది నిర్ణయించవలసినవారు మీరు పాఠకులు.

కపిలవాయి లింగమూర్తి

1. చూ. సాహితీసుగతుని స్వగతం

# అభిప్రాయము

శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు ఆదర్శమూర్తులైన ఆంధ్రోపాధ్యాయులు, సంస్కృతాంధ్రములలో చక్కని చిక్కని పాండిత్యముగలవారు. వారు చతుర్విధ కవితావిశారదులు. అందును చిత్రకవితా నిర్వాహణలో దక్షులు. అనేక చిత్రకృతులను సరసముగా రచించినారు.

ఈ దుర్గా భర్గ శతకములు రెండును విలక్షణములైనవి. దుర్గాశతకము అలంకార శాస్త్ర లక్షణములకు లక్ష్యములుగా ఉండునట్లును, భర్గ శతకము ఛందశ్శాస్త్ర లక్షణములకు లక్ష్యములుగా ఉండునట్లును రచింపబడినట్టివి. వారికా యా శాస్త్రములలో గల పరిణత ప్రజ్ఞకివి నిదర్శనములనుటలో సందేహము లేదు.

కవిగారు తమకు లభించిన విశ్రాంతి కాలములో మధుర మనోజ్ఞ మంజుల కావ్యము లింకను రచించి సహృదయులకు హృదయాహ్లాదమును కలిగింతురని ఆశించుచున్నాను.

బుధవిధేయుడు

గడియారం రామకృష్ణ శర్మ

అలంపూరు

జూన్ 2, 1984

# సందర్శనము

తెనుగు సారస్వతములో లక్షణ గ్రంథములు సంస్కృతము నుండి అనువదింపబడిన వానితోబాటు స్వతంత్రతా ముద్ర గలిగినవి కూడా కొన్ని గలవు.

వ్యాకరణచ్ఛందోఽలంకారములను, రస విషయమును, వివరించుట లక్షణ గ్రంథముల పద్ధతి. వీనిలో అన్నిటితో కూడినవి కొన్ని, ఏక విషయ ప్రాధాన్యం గలవి మరికొన్ని - ప్రసిద్ధి చెందినవి.

సారస్వతోపాసకునకు వ్యాకరణము, ఛందస్సు, అలంకారములు - తప్పనిసరిగా తెలియవలెను. వీనియందు ఏ యొకటి లోపించినను, అతని సారస్వత పరిజ్ఞానము పరిపూర్తి కాజాలదు.

పూర్వుల నుండి నేటి తరంవరకు ఎందరో లక్షణ గ్రంథాలను రచించినారు. వానియందు కొన్ని పండితజనైక వేద్యములు, మరికొన్ని పఠన పాఠనాదుల వలన ప్రాచుర్యము నందినట్టివి. అప్పకవీయము, బాలవ్యాకరణము, సులక్షణసారము-చంద్రాలోకము, ఇవి సారస్వతీయులకు పరమ ప్రామాణిక రచనలు, జిహ్వాగ్రమున వర్తించునవి.

ఛందస్సును నేర్చుకొనుటకు సులక్షణ సారము, అలంకారాలకు చంద్రాలోకం-ప్రారంభమున వచ్చునవి. వానిని కంఠపాఠము చేయుట కొద్ది కాలం క్రితం ఒక సంప్రదాయంగా ఉండేది. చదువుల పద్ధతి మారినది. ఈ పద్ధతి కూడా అడుగున పడింది.

ఈ మారుతున్న పద్ధతికి - అడుగున పడుతున్న సంప్రదాయానికి కొత్త పద్ధతిగా ఛందోఽలంకారాలను జ్ఞప్తిచేసుకోవడానికి అనువుగా-సులువుగా ఉండే విధంగా లింగమూర్తిగారు ఈ శతకముల వ్రాసినారు.

శతకం అనగానే మామూలుగా నూరు పద్యాలు అనుకుంటాం. రచయిత-దీనిని శతక లక్షణ యుక్తంగా చేయటమేగాక - ప్రతి పద్యాన్ని ఒక అలంకారానికి, ఒక ఛందస్సునకు ఉదాహరణగా చేసినారు. ఇది ఒక నూత్న సృష్టి. ఈ విధంగా రెండు కలిసి సులభ శైలిలో ఇంతవరకు రాలేదనుకుంటాను.

ఈ గ్రంథం రెండు శతకాలతో కూడినది. ఒకటి దుర్గా శతకం, మరి యొకటి భర్గశతకం. మొదటి దానికి మకుటం దుర్గ, దీనిలో అలంకారాలు చెప్పబడినవి. దుర్గా శతకం అలంకారాలకు తగింది. ఎందుకంటే-దుర్గాదేవి అలంకార యుత, అలంకార ప్రియ. శతక దుర్గ 109 అలంకారాలచే భూషింపబడటం సరసంగాను, సమయోచితంగాను ఉన్నది. ఈ సందర్భంగా లింగమూర్తిగారు-దుర్గ అంగవర్ణన (40 పద్యాల్లోను) అష్టాదశ శక్తిపీఠ వివరము (18 పద్యాలు), అవతార కథనము (9 పద్యాలు), దుర్గాతత్వము - (19 పద్యాలు), అభ్యర్థనము (23 పద్యాలు) చక్కగా చేసినారు. అలంకారములు అలంకారములే అని లాక్షణిక సిద్ధాంతము. ఈ శతకం ఆ వాక్యానికి సార్థకత కలిగించింది. 109 పద్యాలను అలంకార యుతంగా-ఒక్కొక్క అలంకారానికి లక్ష్య లక్షణములుగా వ్రాసినను పాఠకునకు విసుగు కలుగదు. ఒక గీత - ఆటవెలది - శతకాన్ని చదువుతున్న అనుభూతి మాత్రమే కలుగుతుంది.

ఇక రెండవ శతకం భర్గమకుటయుతము. దుర్గ అలంకారయుతయైనట్లే, భర్గుడు శబ్ద ప్రధానుడు. ఈనాటి మన వ్యాకరణములకు మూలములైన అ,ఇ, ఉ,ణ్- పరమేశ్వర ఢక్కా వినిర్గత ధ్వని విశేషములు. అక్షరాలు పదాలుగా, పదాలు వాక్యాలుగా, వాక్యమయం సారస్వతముగా ప్రసిద్ధి.

ఛందస్సు అక్షర ప్రధానమైనది. దీనిని భర్గమకుటంతో చెప్పటం మంచి పద్ధతిగా నున్నది.

సులక్షణసారం, అప్పకవీయం - తెలుగు ఛందానికి ప్రచారం తెచ్చిన ముఖ్య గ్రంథాలు. వీటికన్నా విషయ వైవిధ్య - వివరణలు గల ఎన్ని ఛందో గ్రంథాలున్నను, వీటి ప్రసిద్ధి వీటిదే. ఎన్ని రకాల 'బాలశిక్ష'లు వచ్చినా 'పెద్ద బాలశిక్ష'ను కాదనజాలగలవా ?

తెనుగులోని యతి ప్రాసల విషయంలో అప్పకవి వరకే ఎక్కువ వలు- వాదోపవాదాలు జరిగేవి. అందుకే 'భీమన పదిచెప్పె.......... పద్యం వ్రాయవలసి వచ్చింది అప్పకవికి. అయినా 41 యతులను అప్పన శక్తి గొప్పదే! వీటిలో అవసరాలు, అనవసరాలు అని ఇటీవల శోధకులు నిగ్గు తేల్చినా, అప్పకవినాటి సాహిత్యములో అవి అవసరమం

సులక్షణసారము, అప్పకవీయము - లింగమూర్తిగారి జిహ్వాగ్ర వర్తించును. అనేక రకాలైన వృత్తాలతో - కావ్య - ప్రబంధ రచన చేసి తెనుగు ఛందమును సులభమైన పద్యాలలో భావితరానికందించ వలెననే భా భర్గా శతకాన్ని వ్రాసినారు. ఇది మరుగున పడుతున్న సులక్షణ సార స్ఫురణకు తెచ్చేటట్టు వర్తమానానికి ఉపకరిస్తుంది. దీనికి వారు ఏర్పచ పద్యపద్ధతి గూడా దోహదకారి.

దీనిలో ఛందోవిషయంగా - యతిగవేషణము (22 పద్యాలు), నాక్షర విరతులు (35 పద్యాలు), ఉభయవళులు (35), ప్రాసయతులు పద్యాలు) చెప్పబడినవి. అనగా యతులు 22, వ్యంజనాక్షరయతులు ఉభయ యతులు 35, ప్రాసయతులు 28 కలవు. ఇవి మొత్తం 120 అం

లింగమూర్తిగారు సులభముగా అవగాహన కావలెనని కావచ్చు, యత విడమరిచి వివరించినారు. ఈ పద్ధతి వలన యతులు పెరిగినవి. శతక స నియమ పద్యములకు సరిపడునట్లు చెప్పవలెననుకున్నా. అది ఒక పెరుగుద ఇందుకు కొన్ని-స్వర ప్రధానము, స్వర ప్రధానవడి అని రెండు చెప్పి ఉద్విరామము, ఉవళి చెప్పబడింది. ఋవళి, ఋత్వ సంబంధయతులు చెప్పేట వీటికి 5 పద్యాలైనవి. అత్వవళి చెప్పి అచ్చామ్యవళి చెప్పబడినది. ఇ ఇత్వ సంబంధ వడులకు 5 పద్యాలు కావలసి వచ్చినవి.

ప్రాణి విరామాన్ని 3 పద్యాలలో చెప్పినారు. వర్గ యతిలో అన్ని క్షరాలకు వరుసగా యతులు చెప్పవచ్చు గదా! వీరు క,చ,ట,త,ప వీనికి వేరుగా యతులను చెప్పినారు వీటితో పాటు సవర్గ యతి కలదు. ఇట్లే నాసిక, సవర్ణానునాసికలను ప్రత్యేకంగా చెప్పినారు. లుప్తవిసర్గక-గూఢ యతులను వేర్వేరుగా చెప్పినారు.

ఉభయ వళుల విషయంలో అప్పకవి వంటివాడే తర్వాత వచ్చిన విమ ర్శకుల దాడికి గురియైనాడు, లింగమూర్తిగారు. అప్పుబ్ధ, పృషోదరాది, తత్సమ క్రియ, ఆయవదేశ, గుణాపవాదవృద్ధి, స్వరాభాస, లాక్షణికావ్యయ, అందదుకు-యతులను చెప్పినారు; అగ్రాహ్యాయతులు 4 రకాలుగా చెప్పబడినవి.

ప్రాసయతులలో-ఖండాఖండప్రాసమును చెప్పి, ఖండమును, పూర్ణ బిందు వును మళ్ళీ ప్రత్యేకంగా తెల్పడం జరిగింది, వీటితోపాటు-సంయుక్త వ్యత్యయ, వలపలగిలకల గూర్చి చెప్పబడినా, లఘువకార యతి ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది, దీనికన్న ఇంకా రూపాంతర, సామ్యోచ్చారణ ప్రాసయతులున్నవి.

ఇదంతా లింగమూర్తి గారి స్వకపోలకల్పన మాత్రం కాదు, విస్తరిస్తున్న సాహిత్యాన్ని దృష్టిలో పెట్టుకొని-'ఛందోభంగం నకారయేత్' అనే దానికి దృష్టాం తంగా వీరు ఛందస్సును వివరించినారు. వీటిలో కొన్ని ఇతః పూర్వం పరిచిత మైనా, మరికొన్ని క్రొత్త రీతిలో పరిచయం అవుతున్నవి.

రావూరి దొరస్వామి శర్మగారి 'తెలుగు భాషలో ఛందోరీతులు' అనే గ్రంథం-ఎన్నో నూతన యతి ప్రాసల విశేషాలను వివరిస్తుంది, లింగమూర్తి గారు ఆ పుస్తకాన్ని బాగా చదివినారు. అది వివరణాత్మకం విమర్శాయుతం, ఈ పుస్తకం చిన్న చిన్న పద్యాలలో-'అల్పాక్షరముల అనల్పార్థరచన' కలది.

లక్షణ భంగం కాకుండా పద్యరచన చేసే మహత్తరమైన శక్తి యుక్తు లున్న లింగమూర్తిగారు బాలురకు-గ్రహణధారణ పటువులైన బాలురకు-అను వుగా నుండేటట్లు శతకం పేరుతో ఈ ఛందోగ్రంథాన్ని మనకందించినారు.

దైవస్తుతి, శతకరచన ధ్యేయాలతో-అలంకార వివరణ, ఛందో వివృతి జరిగినది; రచయిత వ్యాకరణచ్ఛందోఽలంకార విషయ ధిషణాపాట వత్వం కలిగినవాడు కావున ఇట్టి కృతి వచ్చినది.

ఒక్క పద్యంలో ఒక అలంకారం, ఒక ఛందం చెప్పటం శ్రమకాకున్నా, నేర్పు అవసరం. అవిధమైన శ్రమ-నేర్పు కలిగిన ఈ దుర్గా భర్గ శతకములు-శతకనామంతో- లక్షణ గ్రంథాలలో వాసికెక్కవలెను.

ఈనాడు విద్యార్థుల కొరకు గైడు రూపంతో వ్యాకరణం, ఛందస్సు, అలంకారాలు వస్తున్నవి. అవే పూర్తి లక్షణ గ్రంథాలనుకుంటున్నారు. ఆ భావం పోవలెనంటే-కనీసం దుర్గా భర్గశతకాలైనా చదివితే బాగుంటుంది.

మిత్రులు శ్రీ లింగమూర్తిగారు కథకుడు, నాటక కర్త, శతకాలు-ప్రబంధాలు వ్రాసినారు, ప్రాచీనగ్రంథాలను పరిష్కరించి, చక్కని పాఠాలతో వెలయింపచేసినారు. సాహిత్య పరిశోధనయే పరమార్థంగా చేసుకొని-దాన్ని 'లాభసాటి వ్యాపారం'గా మార్చకుండా-యథార్థ పరిశోధనాత్మక కృషిని త్రికరణశుద్ధిగా చేస్తున్నవారు.

శ్రియఃపతి వీరికి ఆయురారోగ్యముల ప్రసాదించి, భాషామతల్లికి సరిక్రొత్త అలంకారాలతో ఊడిగం చేయించవలెనని నా ఆశంస.

''వేదమునకు పాదంబులై వెలయుకతన
ఛందమన్నిటిలో నవశ్యంబుగాదె
పురుషుడఖిలాంగయుతుఁడయ్యు చరణయుగము
లేక నడవ సమర్థుఁడే లోకమునను''—

పాలెం, 509 215
రక్తాక్షి, వైశాఖ బ. ౯ గురువారం,
24-5-1984

భాషా సేవకుడు
శ్రీ రంగాచార్య

# కృతజ్ఞతలు

ఈ శతకాలకు కోరినంతనే తమ అమూల్యాభిప్రాయంతో
అలరించిన బ్రహ్మశ్రీ గడియారం రామకృష్ణశర్మగారికి —

శ్రద్ధతో వినిని సందర్శించిన ఆత్మీయులు
శ్రీ శ్రీరంగాచార్యగారికి కృతజ్ఞతలు తెలుపుతూ —

నిరంతరం నా కృషికి చేదోడు వాదోడుగా నుంటున్న
మా చిరంజీవులు కిశోరుబాబు, అశోకుబాబులను
అభివృద్ధి పరంపరగా ఆశీర్వాదిస్తున్నాను.

నాగర్‌కర్నూలు
తేదీ 26-6-1984

ఇట్లు
కపిలవాయి లింగమూర్తి

# అంగవర్ణనము

1. అతసి కుసుమ కాంతి నపరాజితా సుమ
చ్ఛవిని బోలుచు నీవు శివుని గూడి
గంగతోడ నున్న కాళింది వలె నొప్పి
తివి మనోహరముగ నవని దుర్గ -ఉపమ.

2. వేల్పు గణము లెల్ల వేలకు వేలున్న
వరము లిచ్చు వారు వందలున్న
నెందరున్న నేమి యందరి లోపల
నీకు నీవె సాటి నిజము దుర్గ -అనన్వయము.

3. వామ విగ్రహంబు వలెను దక్షిణ మూర్తి
దక్షిణాంగమునకు దగును వామ
గాత్ర మంతె వాని కన్యోపమంబుల
నెరుగనట్టి వపువు నీది దుర్గ - ఉపమేయోపమ.

4. తల్లి నీ పదములు దర్శన మీకున్న
స్నానమాడు నదుల సారసములు
అలరు లిచ్చు వనములందు పల్లవములు
గలవు లెమ్మ గాంచగలను దుర్గ -ప్రతీపము.

5. నేత్ర పద్మములను నీ పదార్చన సల్పు
వారి నుదుటి వ్రాత వక్రగతుల
తన్నఖాగ్రపాళి తిన్నగా సవరించి
శుభము లిచ్చుచుండు చూడ దుర్గ. —రూపకము.

6. మకర తోరణములు మంగళ కాహాళ
ములుగ వలువ చాటు గలుగు నీదు
జంఘయుగము భక్తజనుల కాలయమందు
దర్శనం బొసంగి తనుపు దుర్గ — పరిణామవ

7. అద్దములుగ నెంచి నాదర్శవంతులు
అరటి దొన్నెలంచు సరసమతులు
పసిఁడి బిళ్ళలనుచు పామరుల్వొగడుదు
రుర్వి నీదు జాను యుగము దుర్గ — ఉల్లేఖవ

8. మండపముల ద్వార మార్గంబులందున
కరుల కదళితరుల గాంచినపుడు
తలఁపు నందు నిలచు లలిత సుందరమైన
తావకోరుయుగ విధంబు దుర్గ — స్మృ

9. నీ శరీర రామణీయక స్రోతసి
నోలలాడునట్టి యోగి గణము
జఘన సీమ గన్న సైకతంబని నేత్ర
పటలి బఱచు చిత్ర పడుచు దుర్గ — భ్రాం

10. పంచ భూతములను ప్రత్యక్ష రూపంబు
గగనమునకు లేదు గాన నీకు
ఘన కుచాద్రులకు జఘన పులినమునకు
నడుమ గలదొ ! లేదొ ! నడుము దుర్గ — సందేహమ

11. గగన కుసుమ మనఁగ గల్ల యందురుగాని
వస్తుతత్వ మెఱుఁగు వారు నీదు
నాభిఁ జూచి నపుడు నాభిగాదయ్యది
యబ్ధి పుష్ప మనియె యంద్రు దుర్గ -అపహ్నవము.

12. హరుని జూచి నీవు నహిభూషణమ్మను
దాల్చినావ నా నుదరము పైన
నారు నొప్పుచుండు నల్లనై కాలాహి
నాఁ బ్రశస్త లక్షణమున దుర్గ -ఉత్ప్రేక్ష.

13. జనని నీ యుదరము ననుగల వళుల సుం
దరము వేరె వాని తరహ వేరె
వానిఁ బోలనెంచి వాహినులందలి
యలలు భంగమగుచు వెలసె దుర్గ -అతిశయోక్తి.

14. కఠినులన్ సరసులగాని యున్నతముగ
గారవించు నెంతగాసి యైన
సమము నీ యుదరము సర్వవేళలనంచు
సన్నుతించుచుండు జగము దుర్గ -తుల్యయోగిత.

15. కజ్జలంబు చేత కన్నుదామరదోయి
గంధకలన చేత కంఠసీమ
కుంకుమంబు చేత కుచకలశద్వయి
నెపుడు శోభలీను నీకు దుర్గ -దీపకము.

16. కలుగనేమి హారములు నెన్నిరుచులవి
నెలత వక్షమునకు నిండుదనము
కుచములే కుచములకును జూచుకంబులే
వెలితిలేనిదనము గలుగు దుర్గ -అవృత్తిదీ

17. మల్లెతీవ యొకటి మామిడికిని దగు
ఆనురూప్య మగుచు నల్లుకొనగ
నీదుబాహులొకటి నీలకంఠుని పరి
ష్వంగమునకు దగును జగతి దుర్గ -ప్రతివస్తు

18. భువనమందు పద్మములె కోమలంబులు
వనములందు పల్లవములె మృదువు
అవనియందు నీదు హస్తంబులే సుకు
మారమగును ప్రమదమార దుర్గ -దృష్టాం

19. శంభుమేన మదను సంజీవలతికలై
యులుకు గొలుపు నీదు కలికి వ్రేళ్ళ
సౌరు చివురుల మణిసారంబు లందున
గానిపించుచుండు కనగ దుర్గ -నిదర్

20. ద్యుమణి ముందు వెలుగు చుండవు చుక్కలు
మొగము తూటువోవు ముత్తెములకు
నీ నఖాళి వెలుఁగు నీరంధ్రముగ గానఁ
దారలగునె వాని తరము దుర్గ -వ్యతిరే

21. బాహుమూలరుచుల పంక్తులతోఁ బాటు
బన్నసరుల రుచులు బర్వుచుండ
కంబుతోడ మంగళంబుగాఁ జూడంగ
బడును నీదు గళము పుడమి దుర్గ -సహోక్తి.

22. చట్టితనము లేక సౌందర్యరేఖచే
ద్విదళమైన నీదు గదుమతీరు
చూతఫల ముఖాగ్ర సుందర భంగిమ
లినుమడించి మించి యెసఁగు దుర్గ -వినోక్తి.

23. తావకాంగములను భావించి చూడఁగ
రాగ సాత్వికముల యోగ మెఱిఁగి
యలరు చెక్కులొకపె నాదర్శమై శివ
ప్రీతికరముగాను పృథివి దుర్గ -సమాసోక్తి.

24. సతము రాగమునకుఁ బ్రతిబింబమై సుధా
లపనములకుఁ దావలంబగుచును
దావకాధరంబు దనరుట చేతను
హరు నపేక్ష పాత్రమయ్యె దుర్గ -పరికరము.

25. ఢమరుక స్వరాల కమరించి స్పష్టతా
క్రమము బింబరుచుల లాభమంది
మేలిమైన దాడిమీ బీజరుచినంది
వలలు నీదు రదన పాళి దుర్గ -పరికరాంకురము.

26. నెగడి గంధఫలిగ నేత్రాళి కడలకు
నొదుగ కనకవర్ణ మొదవి నీదు
నాస ముద్దులొలుకు ననరాజమై మొగం
బునకు ముక్కె యందమనగ దుర్గ -శ్లే:

27. సిరివహించి మించి శృతిపారగంబయి
రాగమున్ ప్రసన్నతా గుణంబు
నిశ్చలంబు గలుగు నీ నేత్రసంపద
నెవరి మెచ్చుగాదు భువిని దుర్గ -అప్రస్తుత ప్రశం:

28. చూపు నిమిషమును రజోదూషితంబు గా
నీక నేత్రరక్ష నెసఁగు నట్టి
పక్ష్మయుగమె శోభ పరగ నీ ముఖరంగ
మునకు నిత్యమొసఁగు నవని దుర్గ -ప్రస్తుతాంకురవ

29. నీదు భ్రూలతలను నెదనెంచి నీలిమ
కజ్జలమును, వక్రగతి బిడౌజు
చాప సంగతిని విసర్జించినవి తమ
చిర నివాస మమత మఱచి దుర్గ -పర్యాయోక్తి

30. ఏక కళను దాల్చు పేపాటియని శంభు
శిరముగాంచి నీ నుదురు శశాంకు
కళను సగము నిల్పి కరిగి పోకుండఁ బో
షించుచుండు నెపుడు మించి దుర్గ.

31. నెన్నొసటను మించు నీ చూర్ణకుంతల
ములను వంకరనుచు బలుకు జగము
వాని ననగనేల వాని విధియె యంత
గాదె జగము నందు గనంగ దుర్గ -వ్యాజనింద.

32. బర్హి పింఛములను గర్హించు నీ శిరో
జముల శోభ వేరె చాటవలెనె
చెందిరంబుఁజిల్కు సీమంత రేఖ నే
ర్పరచి తేల యంద్రు ప్రజలు దుర్గ -ఆక్షేపము.

33. స్నేహమెఱుఁగ కున్నసే స్నేహయుక్తంబు
సుమన రహితమైన సుమనసములు
నైన నీదు కురుల కవి, యౌపచారిక
మగు నలంకరణము లంతె దుర్గ -విరోధాభాసము.

34. విధుఁడు లేనియెడకు వేంచేసె రాహువు
మధువు లేనియెడకు మధుప పంక్తి
యనుచు నీదు వేణి నాశ్చర్య మగ్నుఁడై
చూచుచుండు జనుఁడు చొక్కి దుర్గ -విభావన.

35. కృష్ణవేణి సిరుల గుప్పుచుండిన గాని
కఠినతనంబు రాదు నెఱతనంబె
కుందనంపు రుచులఁ గులికెడు నీ వెన్ను
పసిడి పట్టమగుచుఁ బరఁగు దుర్గ -విశేషోక్తి.

36. నిన్ను భ్రామరిగను నెన్నగా లేకున్న
నీ కపోలి యుగళి నిక్కముగను
భ్రమరకంబు లంచుఁ బల్కు నెవ్వఁడు నేత్ర
కుచ యుగంబుఁదప్ప కొసరి దుర్గ -అసంభవ

37. నీదు జఘన తలము నెఱమించు నపరంజి
రత్న నూపురముల రశనదాల్పఁ
దత నితంబసీమ తచ్ఛోభ దాల్చి దీ
పించు చుండు కాంతి మించి దుర్గ -అసంగ

38. నల్ల కలువ లగుచు జెల్లు నీ కనుగవ
కడల భక్త గణముఁ గాంచినపుడు
తరిపి వెన్నెలలను గురిపించు నీ కటా
క్షముల నెన్నదరమె క్షమను దుర్గ -విషమమ

39. బంధు జీవములకు బంధువులను బుట్టి
తా ద్విజ ప్రసన్నతను వహించి
యలరు నీదు విమల హాసంబునకు దయ
తగినదే గదమ్మ ధరణి దుర్గ -సమము

40. జగతి నెల్ల విమలముగ నొనర్పగనెంచి
ఖలుల వదనములను మలినపఱుచు
నంబ నీదు వాక్కు లమృతంబు జిందుచు
నరయ నరయ చిత్రమమ్మ దుర్గ -చిత్రము.

# అష్టాదశ శక్తిపీఠ వివరము

41. లంక యందు నీవు శాంకరి యను పేర
వెలసి తీవు భక్త సులభ! - అయిన
లంక యిమిడినట్టి లవణాబ్ధియందు నీ
యశము నిముడ జాలదయ్యె దుర్గ -అధికము.

42. కంచి యందు నీవు కామాక్షి యనుపేర
వెలసి యున్న కతన విరహవశత
కుండలుండె కంకణుండయ్యె శివునకు
కాము మహిమ యెంత ఘనమొ దుర్గ -అల్పము.

43. సింహలవుగ నీవు చెన్నొంద ప్రద్యుమ్న
పురము వెలిగె రత్నములను బొంది
సింహ తలడములును సింహ తలాటముల్
మణుల బొంది నటుల మహిని దుర్గ -అన్యోన్యము

44. కంస పట్టణావతంసమందీవు చా
ముండి వగుచు వెలసి యుండనేమి
నీవు లేని చోటు నెందుండు లోపల
వెలపలందు నీవె వెలయ దుర్గ -విశేషము

45. కన నలంపురంబు నను జోగులాంబవౌ
నిన్ను పామరౌఘ మెట్టి భక్తి
సత్త్రివనె మనీషి జనమదే భక్తిచే
దేవి వనుచు నిన్నుఁ దెలిసె దుర్గ -వ్యాఘాతము.

46. శ్రీ గిరీంద్రమందు చెలువుగా భ్రమరాంబ
వైన నిన్ను గొలుచు నట్టివారి
శ్రీలు శ్రీల మేలు మేలున దానముల్
దాన పుణ్యములును దనరు దుర్గ -కారణమా

47. కోరి నిలిచినావు కొల్లాపురిని మహా
లక్ష్మి వగుచు నీదు రమ్యమెంచ
చెవులఁదాక కనులు చెక్కుమించిన చెవుల్
నగవు మించు చెక్కు సొగసు దుర్గ -ఏకా॰

48. మాహూరీ పురాన మరి యేకవేణివై
విరహ మూర్తి వలెను వెలుఁగు నిన్ను
గనఁగ గనఁగ భక్తి మనమున మనము నీ
యందు లగ్నమగుచు నలరు దుర్గ -మాలాదీపక॰

49. ఉజ్జయిని పురాన నొప్పి మహాకాళి
వైన నీదు మేను, మేనుకంటె
కనులు, కనుల కంటె కచములు నాగమే
ఘాశికంటె మేచకంబు దుర్గ —సార॰

50. పీఠికాపురాన వెలసియు పురుహూతి
వనగ గద్దె నెక్కి వాసవి వలె
గురుల బుధులఁ బాలకుల నామతించుచు
పెంచిగాతువమ్మ పృథివి దుర్గ -యథాసంఖ్య॰

51. ఒప్పి గిరిజ వనగ నొడ్యాణ పురమున
కటక చక్ర రక్షగా నెసంగ
మహిమ కాంచి డించి మంజీర గేరుచు
దానిఁ జేరుకొనియె ధరను దుర్గ -పర్యాయము.

52. చిత్రకూట మందు చెలగి మాణిక్యాంబ
వై వెలుంగు నిన్ను నఖిల జనులు
తగ నివాళులిచ్చి దంత స్మితరుచులఁ
గొంద్రు జాదులనుచు కూర్మిదుర్గ -పరివృత్తి.

53. కామరూప నిన్నుగన హరిక్షేత్రంబు
నందు నెవ్వఁడైన యన్యుఁడైన
కామరూప మందు కామరూపుల యందు
నిలుపలేఁడు మనము నిజముదుర్గ -పరిసంఖ్య.

54. అందముగ ప్రయాగ యందు మాధవిపేర
వెలసినట్టి నిన్నుఁ దెలిసినంత
మస్తకముల నైన మనసైన వంతురు
సత్యమింత వట్టు జనులు దుర్గ -వికల్పము.

55. వైష్ణవిగను నీవు వటలి జ్వాలాపురి
రాజసమున దయను తేజమునను
భక్తగణము కెల్ల వరములు సిరులును
హరులు సరులు నిత్తువమ్మ దుర్గ -సముచ్చయము.

56. జనని! గయను నీవు సర్వమంగళ యనఁ
దనరి భక్తతతిని దనుపువేళ
నన్య దేవతాళి యరుదెంచి నినుజూచు
మొగము వాంచు నలుగు మొఱగు దుర్గ -కారకదీపక

57. వారణాసి యందు జేరి విశాలాక్షి
వగుచు జగముఁజూడ వలచితీవు
గాసి బాయ నరులు కాశి కాశియటంచు
చెలగి రటకు నిన్నుఁజేర దుర్గ -సమ

58. కన సరస్వతివిగ కాశ్మీరపురి నీవు
వెలయ నీదు గంధములను మించఁ
దలచి తిలకమగుచుఁ దనరి కాశ్మీరంబు
వాని నతకరించి వరలె దుర్గ -ప్రత్యనీక

# అవతార కథనము

59. విధిని వేధ వెట్టు మధుకైటభులఁ బట్టి
నలిచినావు గుమిలి వలెనె యింక
శంబరాదు లెంత జగతి మహామాయ
వైన నాడు నీకు నవని దుర్గ -అర్థాపత్తి

60. గౌరివగుట చేత కాసరాసురుఁడీల్గె
మహిష మర్ధనివిగ మహిని నీవు
అవతరించి నప్పు డమరు లబ్బురమంద
మలను దాకి దుంత మనునె దుర్గ -కావ్యలింగము

61. చండులైన చండ ముండుల జాముండి
రూపమెత్తి రూపు మాపినావు
కన నపర్ణవీవు కాత్యాయనీ ! నీదు
మార్గ మెవ్వ డెఱుఁగు మహిని దుర్గ -అర్థాంతరన్యాసము.

62. తారవై యశోద తరుణికి మందలో
బుట్టినపుడు నీదు గుట్టుఁగనక
వట్టిదనిరి గొల్ల పల్లెలోఁ బుట్టిన
గొప్పదనుచు నెవఁడు సెప్పు దుర్గ -వికస్వరము.

63. దంత కుంతములను దనుజునిఁ జెండాడి
రక్తదంతి వగుచుఁ బరగ నవ్వి
శోణనదిని మొలచి శోభిల్లు పగడాల
మొలక లగుచుఁ దొగరు లొలికె దుర్గ —ప్రౌఢోక్తి.

64. క్షామ వేళ నీవు శాకంబరీ రూప
మునను శాక దానమునను మునులఁ
గాచినట్టి కరుణఁ గణియింప బ్రహ్మ య
నంతుడైన శక్తుఁడగును దుర్గ —సంభాః

65. దుర్గముండ నంచు దుర్గుఁడు గర్వించి
బయలు మాటనమ్మి పలవరించి
గాలికోటగట్టి గగనాస్త్ర సంపదన్
గూర్చె నిన్ను గెలువఁ గోరి దుర్గ —మిథ్యాధ్యవసితః

66. మహిని నిన్నుఁగనక మాతంగి మాతంగు
డసుర చేయి గాలి యాకులంబె
దీపముండగానె దిద్దుకొనె మతంగ
ఋషి తనిల్లు నిన్నెఱింగి దుర్గ —లలితః

67. అమర యాచనమున నరుణుని జంపగా
భవుడు దలచినంత భ్రామరివిగ
నీవె యాతనిఁ గూల్చి నీలకంఠునకు న
ర్ధాంగి వగుట నిలిపితమ్మ దుర్గ —ప్రహర్షణః

# దుర్గా తత్వము

68. జనుఁడు నిన్నుఁగనఁగ సావిత్రిగా మది
జ్ఞానదీప కళిక గ్రాలు తరుణ
మందె మదన పవన మారంభమగు మీద
నేమిజరుగు నెవ్వడెఱుగు దుర్గ -విషాదనము.

69. శ్రుతులు నిన్నుగూర్చి జెప్పు గాయత్రిగా
గాన నిన్నుఁగూర్చి ఘనత నంద
వలయు నంచు మదిని వలవదే మంత్రరా
జంబు నవనిలో నిజంబు దుర్గ -ఉల్లాసము.

70. ఎన్ని బీజములు మ రెన్నెన్ని వర్ణంబు
లున్ననేమి క్షుద్ర మంత్రరాజి
క్షుద్రమే సుమా! సుగుణములే గాయత్రి
వోలె సాధకునకు భువిని దుర్గ -అవజ్ఞ.

71. నీకు నామరూప నిలయకల్పనములు
తత్వదృష్టిచేతఁ దగనివైన
సర్వజన సులభము సాకార మగుటచేఁ
ప్రతిమ కల్పనంబు వలసె దుర్గ -అనుజ్ఞ.

72. స్వార్థపరుల నెల్ల చల్లగాఁ జూచెదు
కమల నీదు భక్తగణము పట్ల
చిన్నచూపుఁ జూడ శివభక్తి ఫలమొకో!
మెంచితమ్మ యెప్పుడేని దుర్గ -లేశము.

73. ఆటగాఁడు శివుఁడు ఆటవెలది వీవు
ఆదిమూర్తు లీరలాడు యాట
వెలఁది గాన దాని విలువెన్న వేయున్న
ఆటవెలఁది సాటి యగునె దుర్గ

74. నరుల శారదవుగ నారాయణివిగను
ఈశ్వరివిగ నీవె యీప్సితంబు
లిచ్చి కావ వలతి వెందరుండిన నేమి
అంబకెవరు సాటి యవని దుర్గ -

75. అరయ పరమ శివుని యర్ధాంగమవుగాన
కాళివైన గాని కాంతు రుచిని
శ్వేత వర్ణవగుచుఁ చెన్నారి శారద
వగుచు నుందు వప్పుడపుడు దుర్గ -

76. శ్యామవైన నీదు జలధరచ్ఛవి భవు
భసిత కాంతి తెల్లవడియు మరల
నాగ చర్మమునను నల్లనై పొలుపొందు
కాళి నీదు కాంతి ఘనము దుర్గ -పూర

77. శివుని గూర్చి తపముఁ జేసి యిల్లాలివై
అతని కర్ధదేహమైన గాని
అతని శాంతసుగుణ మతనిదేగాని నీ
వందలేదు దాని యంశ దుర్గ -అ

78. మొదట నీవు శక్తి వదిగాక శివునితోఁ
గూడి తంతఁ బోక కొామరు గొసరి
వైష్ణవి గను నిలచి వర్ధిల్లితిక నీదు
తేజ మెన్న తరమె ధృతిని దుర్గ -అనుగుణము.

79. గొరివైన నీదు గొరవ రూపంబు
లోన హరుని భూతి రూపురేఖ
లవని జనుల కంటి కావంతయైనను
చూపకుండు నిజము సుమ్మి దుర్గ -మీలనము.

80. ప్రకృతి నెల్ల కడల ప్రతి బింబితంబగు
నీదు రూపు జూచి నిక్క మెఱుఁగ
జాలనట్టి జనులు సందేహమున నీదు
జాడ గానలేరు చూడ దుర్గ -సామాన్యము.

81. గొరివైన నీవు హరునితోఁ గూడఁదా
ద్రూప్య వశత జగతి రూప భేద
ములను దెలియ లేక నలిగెదరని నీవు
కాళివైతి వమ్మ కనగ దుర్గ -ఉన్మీలితము.

82. లోకమాత వనుచు లోకులు నిన్ రమన్
బిలుతురైన నిజముఁ బలుగు నెడల
ఆర్త రక్షణంబు నవసరంబైనంత
కమల కమల గొరిగొరి దుర్గ -విశేషకము.

2)

83. "ఈవు నెందు నుందు" వెదుకంగ గోరిన
గుడుల గోపురముల గుహల వనుల
దేనినడుగ నదియె దెలుపు పోనామాటె
దాని కదియె బదులు గాన దుర్గ -ఉత్త

84. రుచిరమైన నీదు రూపంబుగన ముని
గణము వేళ కొఱకుఁగాచి యుండ
దాని నెఱిఁగి నీవు తలపూవుఁ జూపెదు
దినదినంబు వేళఁ గనగ దుర్గ -సూక్ష

85. నిన్నుగంటి మనుచు నిక్కెడి వారిలో
నిజమెఱుంగు వారి నిజమెఱుంగ
కంతు చేతి హరిణకములైన రమణుల
కమలజుఁడు సృజించె క్షమను దుర్గ -పిహి

86. విషయ సంగములను విడువ జాలని నరుం
డిది ప్రపంచమనుచు నీశ్వరుండు
కామభోగములను గల్పించ నేలంచు
నూరక నిగిలించు చుండు దుర్గ -వ్యాజో

---

# అభ్యర్థనము

87. చల్లగాఁగనంగ చంద్రుదేమరె నన్ను
వసువులైన నాదు వైపుఁగనరు
మనుప దలచలేదు మనువులు గూడను
కీర్తి వీవు! నీవికేమొ? దుర్గ -గూఢోక్తి.

88. చపల మగును సతము జగమెటింగిన దాని
కనగనేల నయిన కమల నొకటి
క్షణము నిలిచినాదు మనవిని కాసింత
వినుము లక్ష్మివీవ పృథివి దుర్గ -వివృతోక్తి.

89. భయముఁ బాపదలచి లయకారుఁడగు నన్ను
సగముజేసి తనుచు జగము కొరకు
నవ్వుకొనెడు శివుని నడిపింతు కనుసన్న
నట్టి ధృతిని నీయవమ్మ దుర్గ -యుక్తి.

90. అన్నియున్న నాడె యాలును పిల్లలు
అవల నెవరి కెవ్వరనును జగము
గాన నిన్నెఱుంగ గలనాడె దయనేయ
వమ్మ నాకు మేధ నవని దుర్గ -లోకోక్తి.

91. పుష్టి గలుగువాఁడె పురుషార్థ పరుఁడగు
కాని వాఁడు జగతిఁగాని వాఁడు
ఇలను వరము లీయఁ గలవారె దేవత
లమ్మ పుష్టి నొసగ వమ్మ దుర్గ -ఛేకోక్తి.

92. దేవివనగ నిన్ను దేవియా! శక్తివం
చనగ శక్తియా! యటంచు నెపుడు
విరుగ బడెడు వారి విధికొక దండంబు
శ్రద్ధనీయ వమ్మ చాలు దుర్గ -వక్రోక్తి

93. కంటికొనల నుండి కరుణ వెలార్చుచు
మొగముపై ప్రసన్న ముద్రఁజెలగ
అభయ హస్తమున నిరంతర ముందు వా
క్రియను నన్నుఁబ్రోవు క్షితిని దుర్గ -స్వభావోక్తి

94. పగటి వెన్నెలలుగ జగమెల్ల వెలుగగా
దేవి శివుని గూడి దివ్యదీప్తి
నెపుడు దోచెదో! మరెప్డు రక్షించెదో
మతి నొసంగి నెఱుఁగ మనుచు దుర్గ -భావికమ

95. శతమఖాది సురలు సన్నుతించెడు నీవు
విశ్వసృష్టి సలిపి వెలయు నీవు
కాంతివైన నీవు కైవల్యమగు నీవు
బుద్ధి నొసగి కరుణఁ బ్రోవు దుర్గ -ఉదాత్తమ

96. నీ దయారసంబు నిగిడింతు వెవరిపై
వారిఁజూచి వారివారిఁజూచి
యమరవరులు లజ్జనందెద రటుగాన
నుచిత లజ్జనొసగి యోము దుర్గ -అత్యుక్తి

97. ఇల రసాయనంబు లెన్నేని నిత్యంబు
వాడనేమి మేను వాడువారు
నిది శరీర మగుట నిప్పుడు దెలిసెను
మేలి వపువు నిచ్చి యేలు దుర్గ -నిరుక్తి.

98. కోపమునను రాదు కోరినంతన రాదు
రాగమునను రాదు త్యాగగాదు
శాంతి గలుగుచుండు శాంతిచేతనె గాన
శాంతి నొసగి నన్ను సాఁకు దుర్గ ప్రతిషేధము.

99. మేనియలత దీర్చు విశ్రాంతి విశ్రాంతి
స్వాంత చింత దీర్చు హాళి హాళి
ఆత్మ తుష్టి నిచ్చు నానంద మానంద
మవి యొసంగి మనుపవమ్మ దుర్గ -విధి.

100. గోవులందును మేలి పూవుల యందును
బాపలందు ముద్దు పాపలందు
సతుల మొగములందు చరియించు కతమున
శ్రీవి నీవె యిమ్ము శ్రీని దుర్గ -హేతువు.

101. నిన్ను గొలువ నెంచి నిజముగా సంసార
మునకు వచ్చి నరుఁడు తనదు చిత్త
మన్యమగుట చేత నందుండు నందాఁక
సఖియ నేవె సలిపి చనును దుర్గ. -భావోదయము.

102\. కానుపించ నంత కాలంబు తహతహ
కానిపించి నంత కలుగు బాటు
వసుధ నింక నెపుడు భక్తుండు తనదైన
సత్వమూని యిలను సాగు దుర్గ భావస

103\. చపల చిత్త మెటుల సాధింతు దీనిని
ఏమనందు ? నింక నేమి జేతు !
ఎవరి నడుగ జొత్తు ! నేరీతి గడపుదు
నెటుల నిన్ను జూతు నెఱుఁగ దుర్గ -భావశబ

104\. అబల లనుట మాత్ర మంతయే లలనలు
కన్ను గొనలతోనె కాము బాణ
మేసి యెట్టి మగని యెదతూటు గొట్టెద
రమ్మ క్రౌంచ మట్టులవగ దుర్గ భావశా

105\. తల్లి యెట్టి నీదు తలయందు పుష్పవం
తులు సమంబు లగుచు దోచుచుండు
రట్టి నీవు దేవతావళి యందున
నున్నతముగ నొప్పుచుందు దుర్గ. -రసవదలంకారః

106\. ఎపుడు నేను శ్రీగిరీంద్ర మందు వసించి
కృష్ణవేణి యందుఁ గ్రుంకి గ్రుంకి
గౌరి! దేవి! మాత! కాత్యాయనీ! యని
నిన్నుగొలువఁ గలనొ నిత్యదుర్గ - ప్రేమోలంకారః

107. పాపములకు జడిసి పరువెత్తు మనుజుని
బూచి తోలు గప్పి బూది బూసి
కోల చేతికిచ్చి గోచిని బెట్టించు
కోడిగంపు జగతి కొనకు దుర్గ -ఊర్జస్వితాలంకారము.

108. ఎంత చూడగూడదే ననుకొన్నను
అదును జూచి యేదొ హర్ష శోక
సమితిఁగూర్చు నాకు సంసారమేను నీ
వైపు జూచు నపుడె వసుధ దుర్గ -సమాహితాలంకారము.

109. సుఖము నిచ్చు సిరులు సుదతి మనోహరి
యరయ కాపురంబె యవని స్వర్గ
మైననేమి బ్రదుకు లంగనాపాంగ చం
చలము లగుగదమ్మ జగతి దుర్గ -విరుద్ధ రససమావేశము.

---

# యతి గవేషణము

స్వరయతులు :

1. అమృత తత్వంబు నీయది, ఆదిపురుష !
ఆత్మ రూపంబు నీయది, ఐంద్రవినుత !
ఐంద్ర జాలికుడవు నీవు ! ఔ కలాప !
ఔపనిషదర్థమవు నీవు ! అభవ ! భర్గ -అ

2. ఇంతియన శక్తి పురుషుండు ఈశ్వరుండు
ఈ రహస్యం బెఱింగిన ఋషి గణంబు
ఋజరిపు నాశ మిమ్ముల నెల్లవేళ
నేకముగ నెంచి పూజించు నిలను భర్గ -ఇ

3. ఉర్వీజల మగ్ని వాయువు ఊమములును
ఊఢు డుడుపతి సోమాసి యొక్కఁడైన
యుజ్వలంబగు మూర్తివి, ఋభున దీశ !
ఋనగాత్మజ రమణ ! నన్నేలు భర్గ -ఉద్వీరా

4. అమృత కరుడుండుటను సహస్రారమందు
విలకు దెల్పుటకై లలితేందు రేఖ
నుంచితివి తలయందు మహోగ్రదక్ష
డలుగ శశికిని బాపి దేహార్తి భర్గ -స్వరప్రధా

5. అవని కుతికెదు గంగ పెల్లడప దలచి
నెనయ జడలందు బంధించి తెల్లవేళ
నిల గమన శీలమగు బుద్ధి నెప్పడిట్టు
లచలగతి నుంచుదని చూపననగ భర్గ -స్వరప్రధాన

6. అబ్బ రవులక్షులైన తమోఒభిహరుఁడు
అగ్నిగాడెటులంచు తపోఒర్చివోలై
నలిక మందున దాల్చి మనోఒబ్జభవుని
బూది జేసితి వాగ్నేయమునను భర్గ -లుప్తవిసర్గ వళి.

7. అమరతతి వేదనిన్ పశుపతేఒ క్షరయని
అబ్ధిజ విశుద్ధ గరమ పరోక్షలీల
అలవిశుద్ధ తలాననన్యో ఒన్యరీతి
నమర నిల్పితివి విశ్వకర్త్రిఒజ భర్గ -గూఢస్వర వళి.

8. ఉదరమున నాహతము విష్ణువునకు నునికి
ఉబిది నాతని పఱపైన వోఢశక్తి
ఉరగపతి రూపమున నీవువొంది దాని
నురమునం దాల్చి వెలసితివోహో భర్గ -ఉవళి.

9. ఇమ్ముగా జీవుఁడయి నీవు పృథివినొంద
పృథివి నీమేని యందున నెమ్ములయ్యె
ఊనె నిన్నిర్గి జీవుఁడీ సృష్టిననగ
నొగి నెముకపేరు దనరునీహృదిని భర్గ -ఋత్వసంబంధ వళి.

10. ఋతిగస్వాధిష్ఠ చక్రంబు యోగమాయ
ఋజువు గనకుండ గప్పె ప్రాయిని యనంగ
ఋషభ! ముప్పన్నె పటమున హీనగతిని
ఋద్ధిగా నీదుకటి జిల్కు హొయలుభర్గ -ఋత్వసంబంధ వళి.

11. ఋషభ తత్వముపై నీగరిష్ఠ శక్తి
ఋతము చేత నధిష్టించి రూఢిగనుట
ఋషభ మీ వధిరోహించి లీలతోడ
ఋషుల కగుపించు చుండు హృల్లేఖ! భర్గ -ఋః

12. కృతక మృగయ! కిరీటి నీరూపమెఱుఁగు
కృష్ణ వర్త్మాక్ష మరుఁడు నీరోషమెఱుఁగు
కృష్ణ తారాధరార్య నీరీతి యెఱుఁగు
కృష్ణగళ నిన్నెరుంగుచే రేఖ భర్గ -ఋః

13. క్రీడి విజయుని జేసితి కృపఁదలిర్ప
క్రూరు పుణ్యుని జేసితి కృపఁదలిర్ప
క్రేపు కపిలనొనర్చితి కృపఁదలిర్ప
క్రొత్తలగు చుండు నీదయాదృష్టి భర్గ -ఋః

14. మృతి దలంపక నరుఁడు నీ సృష్టిలో వి
శృంఖలంబుగ దిరుగు నికృష్టమైన
తృష్ణలను తల్లడిల్లు నిస్పృహను గనఁడు
హృద్యమని కాపురంబున వృథగ భర్గ -ఋత్వసామ్య వ

15. అభయ దాయక! భవపు గీఱను భరింప
ఎటుల నిన్నెఱఁగెడి బుద్ధినిం బడయుదు!
ఉంచు నీదయ వీఁడు బాలుండటంచు
అంబరాంబర నే నమాయకుఁడ! భర్గ -అచ్చాసామ్యవ

16. ఇలను నెంతటి వారైన క్లృప్తిలేక
నూరకయె యెట్లుగాంచు నీక్లృప్తి సుమ్మి
యెవ్వఁడేగాని యెఱుఁగదే క్లృప్తియైన
నోజనెటు నొందగలడు సంక్లృప్తి భర్గ -ఋత్వసంబంధ వళి.

17. క్లృప్తి కీలగ గలయాప్తి యీయనేమి
క్లృప్త ధూపోపచారాదు లెనయనేమి
క్లృప్తి కుఁడౌరసుఁడు గాని యోజభవము
క్లృప్తి యెట్లున్న నిజమగుటుత్త భర్గ -ఋత్వసంబంధవళి.

18. యుక్తి యెఱుఁగను నేనభిక్లృప్తి కొఱకు
యోగ మెఱుఁగను నేనధి క్లృప్తికొఱకు
హుతభుజుని దన్పలేదు విక్లృప్తిఁబాపి
హేడుఁడను నాకునిమ్ము సంక్లృప్తి భర్గ -ఋత్వసంబంధ వళి.

19. లిబ్బికోసము దివురుచు ౠజహార!
లెస్సకోసము దివురుచు ఋధరదమన!
ౠస్వభావంబు దాల్చి నళికవృత్తి
ఋస్థితా! నిన్ను గనఁడు కూళుఁడు భర్గ -ఋవడి.

20. ౠజ మస్తనికృంత నా! క్రోధపడక
ఋధ్వజుని గాచినట్లు నాక్రోధముడుపు
ౠశిఖాయుధ! సంసార క్రూరముడుప
ఋయశ! యింకెవ్వఁడగు దయా క్లిన్న! భర్గ -ఋవడి.

21. తృష్ణ యడఁగునె నీదయా క్షప్తిలేక
వృజిన మడఁగునె నీదయా క్షప్తిలేక
మృధ తరింపగ నీదయా క్షప్తియొకటె
ధృడతరణి సుమ్మి కృపసేయు క్షప్తిభర్గ -ఋత్వసామ్యము.

22. అచలజా ప్రాణనాథ! ధృతైణ హస్త!
ఇచ్ఛరారోహ! సర్వలోకైక శాస్త!
ఉరగభూషణ! నమిత దేవౌఘ మస్త!
అభయ దాయక! లోకహితైష! భర్గ -వృద్ధివళి.



# వ్యంజనాక్షర విరతులు

23. కంతు కడగంట గాల్పదే కాయికముగ
కాలఫణినైన దాల్పదే కైవసముగ
కైపు విసమైన నిల్పదే గౌరవముగ
కౌశికీ పతి! నినుమది గనునె భర్గ — ప్రాణివిరామము.

24. కిటుకు గల్గు త్రిశక్తులు గీర్వితతులు
గీలుగొని శూలడమరుకా కృతులతోడ
కృష్ణకంధర! యొప్పు నీ కేలియందు
కేశవార్పిత నేత్ర పంకేజ! భర్గ — ప్రాణివిరామము.

25. కుదురుగ కపాలమును బొంద కూటిచింత
కూర్మి హరిణంబు చేపట్ట కొసరుచింత
కోరవిక నేల యోగికి గృహ మటంచుఁ
కుధర వాసుడ వైతివి కృకర! భర్గ — ప్రాణివిరామము.

26. కన్ను గానక నశివ మఖంబు సల్పు
ఖలుల మన్నింపరాదు లోకాననంచు
గణన సేయక దక్షుని ఘనతలెల్ల
ఘస్మ మొనరించి తతని మఖంబు భర్గ — కవర్గజ యతి.

27. చలముగొని ముని తపముల ఛన్నగతిని
ఛద్మముగ భంగ మొనరింప-జతనపడిన
జగతి మన్నించు చేలని ఝషపతాకు
ఝటితగతి బూది జేసితి జగతి భర్గ — చవర్గజ యతి.

28. చతురమగు మాయ పురముల చదల నిలిచి
ఛద్మగతి చేత జగతిని చెదుపుచుండు
జంభులను విడరాదని జెతన మూని
ఝుకటమునఁ గూల్చి తొఁకకోలఁ జెఱచి భర్గ -సవర్గవర్గజయతి.

29. టక్కు చేతను సతులను ఠవళిజేయు
ఠవర మన్నింప రాదని డంబుచే న
డంచితివి వృంద దుఃఖ గాఢంబుగొనక
ఢాక మెఱసి జలంధరు భర్గ -టవర్గజ యతి.

30. తరుణులను జూచి కామ విధమున దుష్ట
థమున వర్తించు నంధుల దశలు దెల్ప
దనుట వరుఁడగు నట్టి యంధకుని దునిమి
ధరణి గాచితి వీవు సత్యంబు భర్గ -తవర్గజ యతి.

31. పలల రుచి బూని యిల పుణ్య ఫలమొసంగు
పక్కి విడి క్రోలుపులులగు బల్మికాంద్ర
బగిసి యిదియని వ్యాఘ్రుని భంగపఱచి
భవిక మొసగితివవనికై పనిగ భర్గ -పవర్గజ యతి.

32. జ్ఞాయినన్ విషయేచ్ఛ సంకాశ రూప !
జ్ఞాయనన్ గర్వ కలన పంచాస్య ! యా గు
ణములు నీదయ లేక గెంటంగ వశమె
నన్ను దయ గనవయ్య సంతతము భర్గ -బిందు యతి.

33. జ్ఞానవంతులు నీ గుణగణములెల్ల
జ్ఞాపకము జేసికొందురు నాగభూష
స్నానసంధ్యల వేళను తపమువేళ
యజనవేళల నెపుడు నిజంబు భర్గ -తద్భవవ్యాజ వళి.

34. కాంచుచుందురు నిన్ను సుజ్ఞానముల, సు
ఖంబు చేతనెగాని విజ్ఞాన జనము
గాసి బడుదురు మిగుల దుర్జ్ఞాతమైన
ఘన కుతార్కికు లెల్ల ప్రజ్ఞలను భర్గ -విశేష వళి.

35. నాగభూషణ! లోకకంటక వినాశ!
నన్ను గావుము దేవ దండంబు నీ గు
ణములు గొనియాడ నేరనెంతటివి! మునిగ
ణములె జాలరికెంత నెందరును? భర్గ -అనునాసికాక్షర యతి.

36. నరుడు నేవేళ నీదు పంచను వసింప
నాకమిక నేల? నదియు పంజరమె నీగ
ణమున నిలిచిన నాడు కంచరములుఁ ప
ణంబు లవియేల! నేల పెంజడలు భర్గ
-సవర్ణానునాసిక సంబంధ యతి.

37. పూజలొనరించి బహుపుణ్యములు గడించి
పొలుపు మీరగ కైలాసమున వసించి
బుధులు గనుచుంద్రు నీరూపమును సతంబు
భోగిరాడ్భూష! సంతోషమునను భర్గ -మువిభక్తి యతి.

38. బుడగ యని జీవితంబు నిర్మోహుఁడగుచు
బోద్ధయై నే నరుండు నిర్మదము చేత
పూజ లొనరించుచుండునో మోక్షమునకు
బోవు నధికారి వాఁడె మున్ముందు భర్గ -ముకార యతి.

39. మహిష మర్దని రమణ! సంయమి మనోజ్ఞ
మధుకరా! ఆశ్రితౌఘ సంరక్షణ! పర!
మనన రూపాది యోగ సంలక్ష్య! నిన్ను
మరువ జాలను, ప్రణవసంవర్తి! భర్గ -మవర్ణ విరామము.

40. మహిమ గనిపించు వాని యంశంబులెల్ల
మహిని నీవని యంద్రు పుంషట్పదవర!
మనమునను నిన్ను మాన హంసస్వరూప!
మన్ననఁ గావు దైత్యసంహర్త! భర్గ -మవర్ణ విరామము.

41. ఆమయంబైన యట్టి కాయంబు నమ్మి
యాతనల బడుచుందు రహంకృతులను,
హర! సదాశివ! నిను గొల్చి యముని బారి
నాపుకొనలేరు, జనము లాహాహ! భర్గ! -ఋజు యతి.

42. అలరు తూపుల జిమ్మి పిన్నది మనంబు
నందుకొని పోవఁ జూచుచున్నాఁడు నరుఁడు
అంగజుని మాయ యందతనిది మఱేమి
యవనిలో సాగకుండ నున్నదిగ భర్గ -ప్రత్యేక యతి.

43. ఈశ్వరా! నిన్ను భక్తి మెప్పింప శక్తి
హీనుఁడను నేను దయను జూపింపవయ్య
ఋషి వినుత! యెట్లు జేసినను నీవె
ఇలను నీటనో! పాలముంచెదవో! భర్గ -భిన్నయతి.

44. వృజిన సంఘంబులను హరియింతు వనుచు
మృగధరా! అక్కఱగ నుతియింతు నిన్ను
వృషభ వాహన వినుతి గావించి విసివి
తింక దయసేయు నేతరియింప! భర్గ -పెఱ యతి.

45. రమను సేవించి సేవించి రాయిడివడి
ఱాగలను గూడి తిరుగుచు అవ్వాజెంది
రహిజెడిన మీద నినువేఁడు రక్షకొఱకు
అంకు లోకము శివశివా! అవ్వ భర్గ -ఏకతర యతి.

46. బలగముల చేతఁగూర్చిన వసువుచేత
డంబములె చేత మరియును లావుచేత
లాలసతచేత రమణి గళంబుచేత
జనుఁడు మరచును నిన్ను నీ జగతి భర్గ -అభేద యతి.

47. రమణులంగాంచి మణిగాంచి లక్ష్మిగాంచి
డాబులంగాంచి చెలుల కళల్దలంచి
రాచరికముం దలంచి వెఱచు జనుఁడు
డాపు విడినిన్ను గనును వైశముగ భర్గ -అభేద యతి.

౩)

48. పతితపావన! నీచేత వనజజుండు
ఫణివిభూషణ! నీచేత వనశయుండు
బలరిపుసుత! నీచేత వనవిభుండు
భవ్యపదముల నందిరి వరద! భర్గ -అభేద వర్గ యతి.

49. శమదమంబులు విడిచియు షడ్గుణముల
షట్పదము వలె దిరిగి సంసారమందు
సారముంగనలేక విషంబె గ్రోలి
షండులై పోవుచుందురు శఠులు! భర్గ -ఊష్మ విశ్రాంతి.

50. చంద్రశేఖర నినుగొల్వ సాగినంత
జల్పముగ దోచు నన్యవిషయములెల్ల
షాడబముఁగ్రోలు నోటికి చవిటినీరు
శల్యముగ నుండుగాదె! నిజంబు? భర్గ -సరస వళి.

51. నరుఁడు సంసార మనిన ప్రాణములు విడుచు
నాగభూషణ నీకు ప్రణామ విడఁడు
అభవ విషయంబు లంతటియమగ మురువు
హరువు గొల్పునె ప్రజకు పాయకను భర్గ -సరస వళి.

52. క్ష్మాధరంబున వసియించి గణుతికెక్కి
క్ష్మారథుడవయి త్రిపురముల్ మసియొనర్చి
క్ష్మామనోహరునకు పోటి సాటివగుచు
క్ష్మాతలిని గాచితివి శుభచరిత! భర్గ -సంయుక్త వళి.

53. కైరవ ముకుంద కామ ఘుగ్ఘసితకాయ!
అంజన పికాళి అంబు ఘుగ్ఘసితకంఠ!
చండికానాథ! తోషితా ఝల్లినాద!
అభవ! మదగజ దైత్యత్వఘ్నర్త! భర్త -అంతోష్మసంధి వళి.

54. డమరుక వినోద! విశ్వసృడ్ధయ శరీర!
యతిమునిజన మనోంబురుడ్ధయవిహార!
దైత్యసంహారకా! మరుద్ధయ నిభాంగ!
హర! మహాదేవ! ఆశ్రితోద్ధరణ! భర్గ -అంతోష్మ సంధి.

55. పార్వతీవర! ప్రాక్కుబ్బస్తి గౌర!
అఘవిదారణ! వినుత అబ్భయ విహార!
నరులు నిన్గన లేకున్న నరులె వారి
కంటె మేలు సరీసృపగణము భర్గ -అంతోష్మ సంధి.

56. కారణము నీవు జగతి వాఙ్మానసముల
మర్మములు నీవు వేద వాఙ్మయవిహార!
నరులు గనలేరు దానవోన్మద విదళన!
తత్వ మిదియని ధర భవన్మహిమ భర్గ -వికల్ప విరమణము.

57. నాగభూషణ! నీవు చిన్మయుడ వనక
నరులు నీ మహిమలను తన్మాత్ర మనుచు
మహి గణించుచున్నారు సన్మార్గ వరద!
వారినేమన వచ్చు నీ వసుధ భర్గ -వికల్ప విరమణము.



# ఉభయ వళులు

58. అచలజా వల్లభా! యస్మదజ్ఞత మది
తలచి యిడుమల నిడ కస్మ! దార్తి బాపి
ఆదుకొన వయ్య నే యుష్మ దంఘ్రియుగము
నెపుడు నమ్మితి నను భవదీయ భర్గ -యుష్మదస్మచ్ఛబ్ద యతి

59. రమ్యమూర్తివి యతుల పరాక్రముడవు!
ఇలను నీ సరియేరి పరేత నిలయ!
అవ్యయుండవు! నీవు నవ్యయకరుఁడవు!
ఓదకాంగన కేళీవిలోల! భర్గ -పరాజ్గ యతి

60. అష్టకష్టంబులుం గల్గు ప్రాప్తిచేత
పరమసుఖములు గల్గును ప్రాప్తిచేత
రాజయోగము బట్టును ప్రాప్తిచేత
ప్రాప్తి యెటులుండునో నెవడరయు భర్గ -ప్రాది యతి

61. అఘ విదూరులు నినుజేరి సాతిరిక్త
భక్తిచేతను శివ! వృషభాధిపా! హ
రా! మహాదేవ! భవ! రజతాలయా ని
వాస! యని వేడుచుందురు వసుధ భర్గ -ఉపసర్గ వళి

62. ద్వీపిచర్మంబు కటికొక యందమీయ
ద్వీపవతి క్రొంజడల లోననింపు లీన
ద్వీపి తూణీర మించి దీపింతువీవు
ద్వీపి సంసారమీ భీతిఁ దీర్చు భర్గ -అపచ్ఛబ్ద వళి

63. నాస్తి నినుమించు దైవము నాదినుండి
ఇలనుగల దైవతంబుల నేకమైన
నాకలోకేశ వినుత! యీ యవనియందు
నభయ మిడి కావవయ్య నన్నభవ! భర్గ   -నఞ్సమాస వళి.

64. అవనినయ వర్తనోప దేష్టాయమాన
రతుడె జనముల కెపుడు భద్రాయితుండు
అతడె వర్ధిష్య మాణుడీ యవనియందు
చేయుటే గాదు చెప్పుటే చెల్లు భర్గ!   -క్రిజ్ప్రత్యయాంత వళి.

65. అనునిమేషము యువతుల రాగములకు
ననుపదంబును తనయుల లాపములకుఁ
బ్రతి దినంబును రుచిగల పాకములకు
నలరి మది నిను మరచు నజ్ఞాని భర్గ   -ఘఞ్ యతి.

66. అరుగుదెంచియు సల్ప నాపోశనంబు
చూవె బోయకు జిక్కు పృషోదరంబు
అటుల నిరయంబు జేరెడు ద్వారములకు
నరుడు జిక్కును తృష్ణకై యరిగి భర్గ   -పృషోదరాది గణయతి.

67. నలిననాభుండు స్థితిని జనార్దనుండు
అభవ! లయమున నీవు జనార్దనుఁడవు
స్వాంతమున మీకు భేదంబుఁ జదువువాఁడు
అధముఁడగు గాదె తోషిత స్వాంత భర్గ   -నిత్యసమాస వళి.

68. అవని దుర్వ్యసనంబు లుక్కడచు నరుని
కోర్కు లెల్లను దీరు గ్రిక్కిరియు సిరులు
చవట యైనను గాని క్రచ్చఱగ మనిన
నతనికెప్పుడు దీరు నక్కఱలు భర్గ -దేశ్య నిత్యసమాస వళి.

69. అల్పుడైననుగాని నేర్పరిగ నడచి
అవసరంబులకై రజ్జులాడు గాక
రేపటి దినంబుకై కల్లరీడుగాక
నిలను జీవింపవలె వెఱవిడిగ భర్గ -తద్ధిత ప్రత్యయ వళి.

70. అభవ! జగతికి మూలమీవ యరయంగ
ఈశ్వరా! బ్రహ్మ మన నీవెగద! యిక
నెవరు వేఱుగ నుందు రీవే! యటంచు
ఋక్కులు వచించు నిక్కమీరీతి భర్గ -ఏవార్థక వళి.

71. ఇలువడిని దప్పకను నుండెనేని సంధ్య
లెప్పుడును విధిగా సల్పునేని పితల
ఋణము లేవేళ నీగెడునేని యతని
కేల తపములు జపము లీయిలను భర్గ -నిత్య యతి.

72. అతివ జగమందు తా పేదరాలుగాని
రాణకెక్కను గుణవంతురాలుగాగ
నుర్వి రత్నంబుచే ముద్దుటుంగరంబు
అందదే కీర్తితా ధాత్రునాన భర్గ -రాగమసంధి వళి.

73. ఎంతయో గూర్చి కూర్చి గంపెడుగ దాచి
కృపణజీవి దినఁడు చేరెఁడేసి యైన
అందఱును గూడి తారు పదవ దినాన
విందుజేతురు తనముడి విడిచి భర్గ -విభాగ వళి.

74. అభవ ! కనులప్పగింప కన్నప్పగాను
తనువు నర్పింపగా నమిత్తాండి గాను
అరయ నీ గణమందు దేవరసు గాను
రక్షమాం పాహి పాహి మల్లయ్య భర్గ -నామాఖండ వళి

75. అభవ ! జను లాలుబిడ్డలకై తపించి
యంగదను దీర్పగా నంతకంటె మించి
హర్షమున్ గూర్పగా వారలకుఁదలంచి
యెపుడొ మరతురు నిను పరమేష్టి భర్గ -విభక్తి విరతి

76: అభవ ! అష్టాపదంబు నీ ప్రాపు జేరె
నిభవరుండును భక్తి ప్రేరేప నిన్ను
నందుకొనె మానవుండేమి ! యన్యమేమి
తత్సమ క్రియ నెవ్వరు దలప భర్గ -తత్సమక్రియ వడి

77. అర్క కాంతులు దూర గవాక్ష మటుల
నలరు వికసింపగా మందపవన మటుల
నవసరంబగు నీ దయా నయము కొఱకు
భక్తి యదిలేక నినుజేర వశమె భర్గ -అయవదేశ వడి

78. అనుదినంబును బెరుగ ఋణార్ణరాసి
ఎపుడు దేశాటనంబున స్వైరుఁడైన
నుర్వినతనికి బలగ మక్షౌహిణులుగఁ
గలుగనేమిటి నెవఁడగు కడకు భర్గ -గుణాపవాదవృద్ధి వళి.

79. ఈశ్వరా! కరుణింపరావే! యిదేమి
న్యాయమో? లేక నా నేరమా? మరి పరి
హాసమో! చెప్పుమో దేవరా! ఇకైన
భక్తవత్సల! దయజూడు పాహి భర్గ -ప్లుత యతి.

80. జనన భయమున నిను వేడ గనవదేమి
టో! శివాఽవ్యయ దేవశంభో! అదేమొ
కా! ననుంగన పంతమేనా! మహాత్మ
ఏల నీచలమేలనో చెల్ల! భర్గ -ప్లుతయుగ విశ్రాంతి.

81. అభయ మిత్తు వటంచు సారంగ పాణి
నిన్ను గొలుచుచు నుంద్రు మనీషులెపుడు
ఉదటుగను సల్పుదట పాప కుద్దలనము
వైద్య నాథుండ వైన ప్రజ్వలన! భర్గ -పరరూపయతి.

82. రోయజాలఁడు నరుఁడు కుట్టుసురు వరకు
రాగమున కాపురంబు నిస్సారమైన
శాశ్వతంబని తా నహరహము దాల్చు
చేరునెటు నిన్ను కాశి విశ్వేశ భర్గ -గూఢస్వర వళి.

83. అభవ! ఓంకార మందున వాసవాది
యమ వరుణ లోకపాల విశ్వావసులును
అజుఁడు మొదలుగ సలుప విజ్ఞాపనములు
నిలిచి తమరేశ్వరుండన పొలిచి భర్గ -స్వరాభాస వడి.

84. అతివ యున్నను యన్య మొల్ల మిని బూని
అంతరంగంబువం జలింపక మనంగ
ఇలను తప్పక నిన్ను జెందెడిని మునిగ
దోయి! సౌరాష్ట్రి సోమనాధుండ! భర్గ -లక్షణికవ్యయ వళి.

85. ఉరగ కంకణ! రేపు నెల్లుండి యనుచు
ఉరక కాలంబు గడుపు నొకొండు గూడ
ఇపుడె సేవింత మనఁడు! కాసింతయైన
ఢాకినీ భీమశంకరా! లేకి భర్గ -స్వర యతి.

86. ఇంపితంబుగ పిల్ల తెమ్మెరలు వొలయ
ఇక్షుధన్వుని నారి తుమ్మెదలు మొరయ
లేదలిరుబోడి విడి నిన్ను నెలమి నెవడు
దారుకావన నాగేశ! దలచు భర్గ -దేశీయ యతి.

87. అల మృకండజు బ్రదుకు నందదుకులగుచు
ఇనజు దూతలు బట్టి యిల్లిగ్గుచుండ
ఉగ్రముగ లింగమందు సుల్లురికి వచ్చి
గాచి తుజ్జయినీ మహాకాల! భర్గ -అందదుకు వళి.

88. డాబు జూపింపగను జడదారులెల్ల
మాయ గోవును జేసి యావము ఘటింప
రమణ గౌతము నేలితి అవ్వ బాపి
గౌతమీ తటి త్ర్యంబక! కరుణ భర్గ -అగ్రాహ్యసంబంధ వళి

89. మానుగా బ్రహ్మహత్య పాపమ్ము దొలగ
నరుడుగా నున్న యారామ ధరణిపుడు గు
ఱంబు చేసేతు బంధవాటమున నిన్ను
నిలిపె రామేశుడను పేరనిలను భర్గ -అగ్రాహ్యవర్గ వళి

90. యక్షసఖ! చంద్రవతి పితృరక్షణమున
నదటు వుట్టగ నిను జేర లక్షణముగ
యాతనలఁబాపి కళ్యాణ వరము లిచ్చి
యనిపితివి శ్రీగిరీశ మల్లయ్య భర్గ -అగ్రాహ్యాంతస్థ వళి.

91. శాస్త్రవిధు లుజ్జగించి యిహంబు నందు
షడ్గుణంబులు గలుగు దేహంబునమ్మి
సాఁక దివిరెడు నరులకై హర వెలసితి
హిమ గిరులయందు కేదార సరణి భర్గ -అగ్రాహ్యోష్మ వళి

92. 'నిగమ గోచర నీరూపు జగతి యందు
అణువు మొదలుగ నన్నింట నణగి యున్న
తెలియ జాలరు మూఢులు కలియుగాన
ఈశిత శివాలయేశ ఘృష్ణేశ! భర్గ - ప్రాసయతి



# ప్రాస యతులు

93. పొఁడిగా నిన్ను గనలేని నాఁడు నెవఁడు
తోఁడు నీదగు సుమ్మి యానాఁడు కీడు -అర్ధబిందు ప్రాస
దండధరు దూత లేతెంచి గుండె లదరు
చుండగా ప్రాణములు దీయుచుండ భర్గ -పూర్ణబిందు ప్రాస

94. తీపియుండగ జాలదు కాఁపురమున
దాఁపురము గాదు నిజమైన చూపుగలుగ-ఖండాఖండబిందు ప్రాస
కాంచగలడున్న వస్తువు పూఁచవోక
తాండవప్రియ! విజ్ఞుఁడానాఁడు భర్గ -ఖండపూర్ణబిందు ప్రాస

95. శర్వ నినుగొల్చు వారికి నుర్వియందు
తక్కువుండెనె యేదేని నిక్కమరయ
సత్యమెఱుగంగ జాలక వ్యత్యయముగ
నాస్తికులు బల్కుచుంద్రు ప్రశాస్తి భర్గ -సంయుతాక్షర ప్రాస

96. తండ్రి నీవని నమ్మిచు నుండువారి
నేండ్లు పూండ్లైనదయ జూడకుండ నీవు
తీండ్రమైన పరీక్షచే మెండుగ కడ
గండ్ల బెట్టెడిదే న్యాయమంద్రు భర్గ-సంయుతా సంయుత ప్రాస

97. వర్గ షట్కంబు నన్నిపు డుగ్రముగను
వర్తిలుచు బాధ బెట్టెడి చిత్రగతుల-సంయుక్త వ్యత్యయ ప్రాస.
సర్వ జంజాటములు బాపి నివ్వటిలగ
నుర్విదయ జూపి బాపునా నొవ్వ భర్గ -వలపల గిలక ప్రాస.

98. లక్ష్యశుద్ధిగ సేవింప నక్షయంబు
తక్షణము నిత్తువీవు బుభుక్ష వినుత! -క్షప్రాస.
దృక్త్రియంబున నడచు త్రిశక్తులనుచు
సత్క్రియల నిన్ను పూజించె చక్రి భర్గ -సంయుక్తవిశేషప్రాస.

99. ప్రాకృతుండను దేవ నిన్నేక్రియలను
నే క్రమాంతంబుగా గొల్వ లోకమందు -రేఫయుతప్రాస.
ఆద్రిచెడి గుండె బంధంబు లెద్రిచ జాల
నద్రుచుంటిని నాయార్తి విద్రుచు భర్గ -లఘుద్విత్వ ప్రాస.

100. ప్రాజ్ఞియంతవు నీవని ఆగ్నికతతి
బుజ్ఞియమముల గొల్తు రుద్విగ్నమతిని
జన్మముల బాప తమ మనః పద్మములను
సన్మతిని నెప్పుడును గిరిసద్మ! భర్గ -వికల్ప ప్రాస.

101. ప్రాణమును దేహమును నభిమాన శౌర్య
గుణము లున్నివ! మరి! యనుమానమీవ! -అనునాసిక ప్రాస.
విషయములు నీవ! మరియును వ్యసనమీవ!
ఈసమస్తము నీవ! నీవశమె భర్గ -ఉభయ ప్రాస.

102. అంబుజాసన ముఖ్యులు నెమ్మితోడ
అంబికానాథ! నినుగొల్చి సమ్మదంబు -(ప్రాసమైత్రిప్రాస).
నం మొనసిరి గదా నిన్ సతమ్ము గొల్చె
దం మహాదేవ! యపవర్గ మిముభర్గ -అనునాసిక ప్రాస.

103. శార్ఙ్గ పాణినుతా! నిత్యయజ్ఞ పురుష!
ప్రణవ సంవర్తి! నగవాస! మనసిజహర!
మునిజనస్తుత! నన్నింక భ్రమల బెట్ట
జనదు! సంసార మిక జాలు శ్రమలు భర్గ-ఉభయానునాసిక ప్రాస.

104. ఏఋతము నిన్ను జెప్పదో నేరుగాను
ఆఋతిని నేగగాఁజన దేరికైన -ఋ ప్రాస.
దారి మంచిది గాకున్న జాఱుపాటు
సూరికైనను గలుగునే పార! భర్గ -వైర ప్రాస.

105. గ్రంథ సందర్భ గ్రంథులు మంథనమున
లంఘనంబుల పరిపాటి లంఖణమున
గుంభనస్థితు లెల్లను గుంఫనమున
తెల్లమగు లోకమందు రంజిల్ల భర్గ -స్వవర్గజ ప్రాస.

106. నీ యడుగు నమ్మ భక్త నికాయములను
నే యఘంబులు దరిజేరి మాయజేయు? -లఘుయకార ప్రాస.
యేవుసురు బెట్టు శమనుండు? దేవ నీవె
నావిదప పాప జలధికి నావ భర్గ -లఘువకార ప్రాస.

107. లేబరముగాని! సిరియొక్క లావుగాని!
కాలగతిగాని! సిరి సమకూడగాని!
లీలలను గాని మరి కష్ట వేళగాని!
పీడగలవాడు నిను! వట్టి కూళ! భర్గ -అభేద ప్రాస.

108. ఒగిని నీసేవ జేయగా నవని పనియు
గలుగు నెప్పుడు ! రాత్రికి కునుకు దీయు !
రోజు రోజిట్లు గడచును ! వాదుకైన
నిన్ను దలపఁడు మనుజుండు ! నేడు భర్గ -రూపాంతర ప్రాస.

109. రంజితంబుగ నీలోకముం జనంగ
పొందికగ నీదు సేవలకుం దగంగ
అంగజాంతక నీరూపముం గనంగ
నెపుడు గల్గెడినో నాకు ! నీశ భర్గ -సంధిగత ప్రాస.

110. యౌవనము దేహమందున నివ్వటిలఁగ
వింఖరంబుగ మారుండు పుంఖితుడయి
గహ్వారంబున గదలెడు సింహమగును
సంయమము జను డెట్లొందు నయ్య!భర్గ-సామ్యోచ్చారణ ప్రాస.

-: భుజంగ ప్రయాతము :-

111. సకలాత్మక ! దుష్ట నిశాచరకం
టక నాశ ! పురాంతక ! ఛద్మపుశిం
దక ! శంకర ! తాండవ లోల ! హరా !
బకవైరి నుతా ! పరమేశ ! పరా! -అనుస్వార సంబంధ వళి.



# కఠిన పదార్థములు

అంబుముక్కు = మేఘము

అంబురుట్ = తామర

అప్యయకరుఁడు = లయకరుఁడు

అబ్భయ విహారుఁడు = (అప్ + హయ) = ఇంద్రుడు

ఇనజుదూతలు = యమకింకరులు

ఊషము = ఆకాశము

ఋణార్ణము = అప్పుతీర్చుటకు చేసిన అప్పు

ఋతము = సత్యము

ఋతి = స్వరము, శుభము

ఋద్ధి = సమృద్ధి

ఋభుక్షుడు = ఇంద్రుడు

ఋషభము = ఎద్దు

ఌధరదమనుఁడు = గజాసురారి

ఌధ్వజుడు = కపిధ్వజుడు

ఌయశుడు = ఌకారముచే చెప్పబడువాఁడు

ఌస్థిరుఁడు = అగనివాసుఁడు

ౡజహారుఁడు = నాగభూషణుఁడు

ౡజుఁడు = అరవిందసూతి

ౡజమస్తనికృంతనుఁడు = బ్రహ్మశిరము ఖండించినవాడు

ౡశిఖ = నేత్రాగ్ని

ౡశిఖాయుధుడు = శివుడు

ౡస్వభావము = ఊసరవెల్లి తీరు

ఓదకాంగన = గంగాదేవి
కన్నప్ప = ఒక భక్తుడు
కామధుక్కు = కామధేనువు
క్లప్తి = ఏర్పాటు
కౌశికీపతి = శివుడు
ఝకటము = జగడము
దేవరసు = ఒక భక్తుడు
నమిత్తాండి = ఒక భక్తుడు
పృషోదరము = మచ్చలదుప్పి
పుంషట్పదము = గండుతుమ్మెద
ప్రాక్కకుబ్హస్తి = (ప్రాక్ + కకుప్ + హస్తి) ఐరావతము
ప్రాజ్నియంత = ఇంద్రుడు
ప్రాయి = శక్తి
విశ్వశృడ్హయము = (విశ్వశృట్ + హయము) హంస
సంక్లప్తి = చక్కని ఏర్పాటు



# అలంకార వివరం

అర్థాలంకారాలు—

1. ప్రకృతాన్ని ప్రకృతిలోని సుందర వస్తువుతో పోల్చితే ఉపమానం.
2. దానికదే సాటి అని చెబితే అనన్వయం.
3. సమానమైన రెండు వస్తువులను ఒకదానితో ఒకటి పోల్చితే ఉపమేయోపమ.
4. ఉపమానాన్ని చూసి ఉపమేయాన్ని నిరాదరిస్తే ప్రతీపం.
5. వస్తువుపై ఉపమాన ధర్మాన్ని ఆరోపిస్తే రూపకం.
6. ఉపమానమే ఉపమేయంగా మారి కార్యకారి అయితే పరిణామం.
7. ఒకే వస్తువును నలుగురు నాలుగు విధాల పోల్చితే ఉల్లేఖం.
8. సదృశ వస్తుదర్శనంతో పూర్వానుభవస్మరణ కలిగితే స్మృతి.
9. ప్రకృతాన్ని సదృశమైన మరొక వస్తువుగా తలచితే భ్రాంతి.
10. ఒకదాన్ని చూసినపుడు రెండు సదృశ వస్తువులు స్ఫురించి ఏదో నిర్ణయించలేకపోతే సందేహం.
11. ప్రకృతాన్ని సదృశమైన మరోదానితో మరుగు పుచ్చితే అపహ్నవం.
12. విషయాన్ని కల్పితమైన ఉపమానంతో పోల్చితే ఉత్ప్రేక్ష.
13. వస్తువుయొక్క స్థితిని ఉన్నదానికంటే గొప్పగా చెబితే అతిశయోక్తి.
14. రెండు విరుద్ధ వస్తువులకు ఒకే ధర్మాన్ని చెబితే తుల్యయోగిత.
15. ప్రకృతాప్రకృతాలను ఒకే క్రియతో చెబితే దీపకం.
16. ప్రకృతాప్రకృతాలను ఏకార్థమైన క్రియలతో చెబితే ఆవృత్తిదీపకం.
17. రెండు విషయాలను ఒకే సామాన్య ధర్మంతో అన్వయించితే ప్రతివస్తూపమ.
18. రెండు భిన్నవిషయాలకు బింబ ప్రతిబింబ భావం సాధించితే దృష్టాంతం.
19. రెండు సమాన విషయాలకు సదృశత్వాన్ని చెబితే నిదర్శనం.

20. సదృశమైన రెండు వస్తువులకు పోలికతోపాటు భేదంగూడ చెబితే వ్యతిరేకం.
21. రెండు విషయాలను సహభావంతో కలిపి చెబితే సహోక్తి.
22. ఒకటి లేనందువల్ల మరోదానికి కలిగిన మేలో కీడో చెబితే వినోక్తి.
23. ప్రస్తుతాన్ని చెబుతూ అప్రస్తుతాన్ని స్ఫురింపజేస్తే సమాసోక్తి.
24. సాభిప్రాయ విశేషణంతో విషయాన్ని చెబితే పరికరం.
25. విషయాన్ని సాభిప్రాయ విశేష్యంతో చెబితే పరికరాంకురం.
26. నానార్థ పదాలతో విషయం చెబితే శ్లేష.
27. ప్రస్తుతం స్ఫురించే రీతిగా అప్రస్తుతాన్ని చెబితే అప్రస్తుత ప్రశంస.
28. ప్రస్తుతం స్ఫురించే అట్లు మరోప్రస్తుతాన్నే ఎత్తుకుంటే అప్రస్తుతాంకురం.
29. విషయాన్ని పర్యాయరీతిగా చెబితే పర్యాయోక్తి.
30. నిందతో స్తుతిగాని స్తుతితో నిందగాని చేస్తే వ్యాజస్తుతి.
31. ప్రస్తుత నింద మరో నింద మూలంగా చేస్తే వ్యాజనింద.
32. విషయాన్ని చెప్పి దాన్ని మళ్ళీ ఏదో కారణంతో కాదంటే ఆక్షేపం.
33. మాటలో పైకి విరోధం కనిపించి అర్థంలో కనిపించకుంటే విరోధాభాసం.
34. కారణం లేనప్పటికి కార్యం జరిగినట్లు చెబితే విభావన.
35. తగినంత కారణం ఉన్నప్పటికీ కార్యం జరుగకుంటే విశేషోక్తి.
36. ఇటువంటి పని ఎప్పుడూ జరుగలేదనే పద్ధతిలో చెబితే అసంభవం.
37. కారణమొకచోట ఉండి కార్యం మరోచోట జరిగితే అసంగతి.
38. రెండు సరిపడని విషయాలకు పొత్తు చెబితే విషమం.
39. అనురూపమైన రెండు విషయాలకు పొత్తు కలిపితే సమం.
40. కోరిన ఫలానికి వ్యతిరేక ప్రయత్నం చేసినట్లు చెబితే విచిత్రం.
41. ఆధారంకంటే ఆధేయమే అధికమయిందిగా చెబితే అధికం.
42. సూక్ష్మమైన ఆధారంకంటే ఆధేయం ఇంకా సూక్ష్మంగా ఉంది అంటే అల్పం.
43. ఒకదానితో ఒకటి వన్నెకెక్కే విషయాలు రెండూ కలిపి చెబితే అన్యోన్యం.
44. ప్రసిద్ధమైన ఆధారం లేనప్పటికీ ఆధేయం ఉన్నట్లు చెబితే విశేషం.
45. చేయవలసినదానికి బదులు మరొకటి చేసినట్లు చెబితే వ్యాఘాతం.

46. కారణాలు ఒకదాని కొకటి ముడిపెట్టి చెబితే కారణమాల.
47. పూర్వపూర్వాలు ఉత్తరోత్తరాలకు విశేషణాలుగా చెబితే ఏకావళి.
48. ఏకావళి దీపకం (47 + 15) రెండూ కలిపితే మాలాదీపకం.
49. ఒకదానికంటె ఒకటి మేలయిందని చెబితే సారం.
50. మొదట వస్తువులు చెప్పి అదే వరుసలో వాని విశేషణాలో క్రియలో చెబితే యథాసంఖ్య.
51. వస్తువు ఒకదాని పిమ్మట ఒకటిగా అనేకాల నాశ్రయించితే పర్యాయం.
52. ఒకటి యిచ్చి మరొకటి పుచ్చుకుంటే పరివృత్తి.
53. ప్రకృతాన్ని ఒకచోట నిషేధించి మరోచోట చెబితే పరిసంఖ్య.
54. తుల్యబల విరోధాలుంటే దానిలో ఏదో ఒకటి ఎన్నుకుంటే వికల్పం.
55. అనేక కార్యా లేకకాలంలో జరిగినట్లు చెబితే సముచ్చయం.
56. అనేక కార్యాలు ఒకే కర్త నాశ్రయించితే కారకదీపకం.
57. చేయదలచిన పనికి తగిన మరో కారణం కలిసివస్తే సమాధి.
58. అసలు శత్రువు నేమీ చేయలేక అతనిపక్షంవారిపై పరాక్రమం చూపితే ప్రత్యనీకం.
59. విషయం ఇదే ఇట్లుంటే ఇక దాన్ని అడుగట యెందుకు అంటే అర్థాపత్తి.
60. విషయాన్ని సకారణంగా సమర్థించి చెబితే కావ్యలింగం.
61. సామాన్య విషయాన్ని విశేషంతోగాని, విశేషాన్ని సామాన్యంతోగాని సమర్థిస్తే అర్థాంతరన్యాసం.
62. ప్రస్తుతాన్ని సమర్థించటానికి ఒకటి చెప్పి అది చాలదని మరోటి చెబితే వికస్వరం.
63 వస్తూత్కర్షకాఅను హేతువుకానిదాన్ని హేతువుగా చెబితే ప్రౌఢోక్తి.
64. వివక్షితార్థాన్ని "ఇది యిలా ఉంటే సరిపోతుంది" అంటే సంభావన.
65. ఒక అబద్ధాన్ని సమర్థించడానికి మరో అబద్ధం ఆడితే మిథ్యాధ్యవసితం.
66. ప్రకృతాన్ని ప్రతిబింబమైన విషయంతో చెబితే లలితం.
67. ప్రయత్నించకుండానే అపేక్షితం లభిస్తే ప్రహర్షణం.
68. ప్రయత్నానికి విరుద్ధఫలం లభిస్తే విషాదనం.
69. జతగా ఉన్నపు డొకదాని గుణదోషాలు మరోదానికి సంక్రమిస్తే ఉల్లాసం.
70. అవి రెండవదానికి కలుగకుంటే అవజ్ఞ.

71. దోషంలోని గుణాన్ని దర్శించి, ఆ దోషాన్నే కోరుకుంటే అనుజ్ఞ.
72. గుణం దోషంగాను, దోషం గుణంగాను మారితే లేశం.
73. ప్రస్తుతార్థాన్ని యిచ్చే పదాలతో అప్రస్తుతార్థాన్ని చెబితే ముద్ర.
74. ప్రసిద్ధమైన అప్రకృతాలను క్రమం తప్పకుండా ప్రస్తుతానికి వాడితే రత్నావళి.
75. స్వగుణాన్ని విడిచి వస్తువు ఆశ్రయించినదాని గుణాన్ని పొందితే తద్గుణం.
76. వస్తువు ఒక కారణంచే స్వగుణం విడిచి, దాన్ని మళ్ళీ గ్రహిస్తే పూర్వ రూపం.
77. జతగా ఉన్నపుడు వస్తువు స్వగుణాన్ని విడిచి అన్యగుణాన్ని గ్రహించ కుంటే అతద్గుణం.
78. ప్రకృతం యొక్క గుణం రెండవదానితో ఉత్కృష్టమైతే అనుగుణం.
79. రెండు వస్తువులకు గుణంచేత భేదం తెలియకుంటే మీలితం.
80. వానికి ఆకారంచేతగూడా విశేషం కనిపించకుంటే సామాన్యం.
81. సాదృశ్యాన్ని బట్టి రెండు వస్తువులకు భేదం తెలియనపుడు హేతువును బట్టి తెలిస్తే ఉన్మీలనం.
82. వానికి సాదృశ్యంచేత భేదం తెలియనపుడు అది తెలిసే ఉపాయం స్ఫురించితే. విశేషకం. (ఇది85 వది కాదు)
83. ప్రశ్నలోనే గూఢంగా ఉత్తరాన్ని ఉంచితే ఉత్తరం.
84. "నీ అభిప్రాయం నాకు తెలుసు" అని అభిప్రాయ గర్భితమైన చేష్ట చూపితే సూక్ష్మం.
85. పరేంగితానికి మాటతోగాక చేతతో సమాధానం యిస్తే పిహితం.
86. అసలు విషయాన్ని దాచి మరో కారణం చెప్పి సమర్థిస్తే వ్యాజోక్తి.
87. ఒకరిని ఉద్దేశించిన విషయం మరొకరిని సంబోధించి చెబితే గూఢోక్తి.
88. శ్లేషతో గుప్తమైన విషయాన్ని వక్త తన చాతుర్యంతో వివరిస్తే వివృతోక్తి.
89. తన రహస్యాన్ని దాచటానికి క్రియచేత ఇతరుని వంచిస్తే యుక్తి.
90. లోకంలోని రీతిని చెబితే లోకోక్తి.
91. లోకోక్తికి పాండిత్యంచే మరో అర్థం కల్పిస్తే ఛేకోక్తి.

92. అన్నమాటకు కాకువుతో మరో అర్థం తీస్తే వక్రోక్తి.
93. వస్తువు ఉన్నది ఉన్నట్లు వర్ణిస్తే స్వభావోక్తి.
94. జరిగింది లేదా జరుగగలది అపుడు ప్రత్యక్షంగా ఉన్నట్లు చెబితే భావికం.
95. ప్రకృతానికి ఉండే గొప్పదనాన్ని వెల్లడిస్తే ఉదాత్తం.
96. ప్రకృతాన్ని అద్భుతంగా యథార్థం కాని రీతిగా వర్ణిస్తే అత్యుక్తి.
97. పేరుకు వ్యుత్పత్తిని బట్టి అర్థాంతర కల్పనం చేస్తే నిరుక్తి.
98. ప్రసిద్ధమైన నిషేధాన్నే మళ్ళీ నిషేధించితే ప్రతిషేధం.
99. ప్రసిద్ధమైన విధినే మళ్ళీ విధించితే విధి.
100. కారణం, దానివల్ల జరిగే కార్యం ఒకే వాక్యంలో చెబితే హేతువు.

*రసాలంకారాలు*—

101. వ్యక్తులకు రసజ్ఞాన యోగ్యమైన మనోవికారం కలిగినట్లు చెబితే భావోదయం.
102. ఒక్కరికే పరస్పరోపమర్దకంగా భావద్వయం కలిగితే భావసంధి.
103. వెంటవెంట ఒక్కరికే అనేక భావాలు కలిగితే భావశబలత.
104. భావము శాంతించినట్లు చెప్పటం భావశాంతి.
105. ఒక భావానికిగాని రసానికిగాని మరోరసం అంగమైతే రసవదలంకారం.
106. ఒక రసానికి లేదా భావానికి మరో భావం అంగమైతే ప్రేయోఽలంకారం.
107. భావానికి రసాభాస భావాభాసాలు అంగమైతే ఊర్జస్వితం.
108. రసానికి భావశాంతి అంగమైతే సమాహితం.
109. విరుద్ధరసాలు రెండూ ఒకచోట చేర్చితే విరుద్ధరస సమావేశం.

ఇది అలంకారాల సూక్ష్మదర్శనం.

ఇదొక పెద్ద శాస్త్రం. ఒక్క ఉపమ - రూపక - ఉత్ప్రేక్షలలోనే పదుల కొలది భేదాలున్నవి. అలంకారాలు లేని రచన శోభాదరిద్రంగా ఉంటుంది. కాబట్టి కవులకు వీని అధ్యయన మవసరం.

# యతి వివేకం

ఆద్యో వళిః - పాదాది అక్షరానికి యతి యని పేరు.

**-: సాధారణ యతుల పట్టిక :-**

| | |
|---|---|
| అ ఆ ఐ ఔ | ప ఫ బ భ వ |
| ఇ ఈ ఋ ౠ ఌ ౡ ఎ ఏ | జ న ణ |
| ఉ ఊ ఒ ఓ | ర ల ల ళ ళ డ ర ఱ ద డ |
| క ఖ గ ఘ క్ష | ఋ-రి రు రె - ఌ లి లు లె - ళి ళు ళె |
| చ ఛ జ ఝ శ ష స | -బిందు పూర్వకంగా |
| ట ఠ డ ఢ | అనునాసికాలకు వాని వాని వర్గాక్షరాలు |
| త థ ద ధ | |

స్వరవళులు :

1. అత్వవళి — అ ఆ ఐ ఔ
2. ఇత్వవళి — ఇ ఈ ఋ ౠ ఌ ౡ ఎ ఏ
3. ఉద్విరామం — ఉ ఊ ఒ ఓ ఋ ౠ ఌ ౡ గూడ.
4. స్వరప్రధానవళి — మామూలు అచ్చులకు సవర్ణదీర్ఘ - గుణ సంధులలో పరమైన అచ్చులు. అత్వ-ఇత్వ-ఉత్వ సంధులలో పరమైన అచ్చులు.
5. లుప్త విసర్గవళి — విసర్గకుపరమైన అకారమునకు ఓకారమువచ్చును. ఈ సంధిలో ఉభయాచ్చులతో మైత్రి.
6. గూఢస్వరవళి — అన్యోన్యాదులలో అకారాని విధించే ఓకారానికి ఉభయాచ్చులలో మైత్రి.
7. వువళి — ఉత్పత్తి స్థానాన్ని బట్టి యకారంపై ఏత్వాభాసం వకారంపై ఓత్వాభాసం ఉన్నవి కనుక- ఉ ఊ ఒ ఓ లకు వానితో గూడిన వకారానికి.

8. ఋత్వ సంబంధవళి — ౠ - ఇ ఈ - ఉ ఊ ఌ ౡ ఎ ఏ
9. ఋవళి — ఋ - రి - రె - ఌ-లి - లె.
10. రువళి — తెలుగువారి ఉచ్చారణలో ఋకారం "రు" వలె వినిపిస్తుంది. ఋకారో రేఫతాం యాతి కర్మ ధారయ మాత్రకే- ఋషిశ్చాపి రుషిశ్చస్యాత్ - తెలు - ఛం - పే. 315. ఋ - రు రూ - లు లూ - ఉ ఊ.
11. ఋత్వ సామ్యవళి — వర్గ నియమం లేకుండా ఋవడికి ఋవడిగలహల్లు.
12. అచ్సామ్యవళి — తత్సమాలకు, కృత్తద్ధితాలకు ప్రథమాది విభక్తులు చేరే అపుడు వచ్చిన అచ్చులకు మామూలు అచ్చులతో మైత్రి. ఉదా- పుంలింగంబై మహద్వాచకం బయిన నామంబుతుది యత్వంబున కుత్వం బగు- బాల- తత్స-21 - రామ + ఉ = రాము.
13. ఌత్వ సంబంధవళి — ఋ ఌ వర్ణయో ర్మిథస్సవర్ణం వాచ్యమ్ - ఌ- ఇ ఈ - ఉ ఊ - ఋ ౠ - ఎ ఏ.
14. ఌవడి — ఌ - లి - లు - లె - రి - రు - రె - శి - శు - శె.
15. ఌత్వ సామ్యవళి — వర్గ నియమం లేకుండా ఌకారానికి వ్రువసుడి గల హల్లు.
16. వృద్ధివళి — అకారమునకు ఏచ్చులు పరమగు నపుడు వృద్ధి ఏకాదేశముగా వచ్చును- ఇ = ఏక + ఏకము = ఏకైకము = అ. ఈ సంధిలో పరమగు వానికి లేదా వచ్చిన వానికి యతి చెల్లును.

*వ్యంజనాక్షర విరతులు :*

17. ప్రాణి విరామం — సవర్ణమైన హల్లులు అత్వ - ఇత్వ - ఉత్వవళు● ప్రకారం పరస్పరం చెల్లుతవి. క కా కై కౌ-కి కీ కృ కౄ కె కే - కు కూ కొ కో.
18. వర్గజయతి — అనునాసికాలు విడిచి ఏవర్గాని కావర్గం. క ఖ గ ఘ - చ ఛ జ ఝ - ట ఠ డ ఢ - త థ ద ధ - ప ఫ బ భ.

| | | |
|---|---|---|
| 19. | సవర్ణ వర్గజ యతి | దంత్య తాలవ్యంబులైన చ జ లు సవర్ణంబులు - బాల - సం. 7. చ చ జ జ. |
| 20. | బిందు యతి | బిందు పూర్వకంగా వర్గాక్షరాలు తమ అనునాసికాలకు- ఙ -ంకవర్గ, ఞ-ంచవర్గ, ణ-ంటవర్గ, న-ంత వర్గ, మ-ంప వర్గాలు. |
| 21. | తద్భవ వ్యాజవళి | వికృతి నియమాల చేత ఙ - నణలు, స్నా-త, (య-జలు గూడ చెల్లవలె). |
| 22. | విశేషవళి | తిక్కన గారు ''జ్ఞ'' కారానికి కకారం బిందువు లేకుండనే వాడిరి. కనుక - ఙ - క. ఇటులే తక్కిన వర్గాలు గూడ చెల్లవలె. |
| 23. | అనునాసికాక్షరయతి | న ణలు మిత్రాలు కనుక బిందు పూర్వకంగా ఒకదాని వర్గం మరొక దానికి- ఉదా- న-ంట, ణ-ంత. ఈలాగే 'ఙ-ఞ'లు - 'నమ'లు గూడ మిత్రాలు కావలె. |
| 24. | అనుస్వార సంబంధ యతి | 1. బిందు పూర్వకాలైన ట త వర్గాలు పరస్పరం చెల్లుతవి. ంట-ంత-<br>2. విశేషవళిలో చవర్గానికి క కారం చెల్లింది కనుక ఇటులే బిందు పూర్వకాలై క- చ వర్గాలు గూడ చెల్లవలె.<br>3. బిందుపూర్వకాలై అంతస్థోష్మాలు పరస్పరం చెల్లుతవి. |
| 25. | సవర్ణానునాసిక సంబంధ యతి | న ణ లకు బిందుపూర్వకమై దంత్యతాలవ్యమైన చ జలు చెల్లును- న-ంచ - ణ ంజ. |
| 26. | ముబిభక్తి యతి | మువర్ణానికి ఉ ఊ ఒ ఓ లతో గూడిన ప ఫ బ భ లు - ము - పు ఫు - బు భు - పొ ఫొ బొ భొ |
| 27. | ముకార యతి | సామాన్యమైన ముకారానికి ఉ ఊ ఒ ఓ లతో గూడిన ప వర్గం - ఉదా- పైవలెనే. |
| 28. | మవర్ణవిరామం | మకారానికి బిందుపూర్వకమైన అంతస్థోష్మాలు చెల్లుతవి. |

| | | |
|---|---|---|
| 29. | ఋజుయతి | య - హ లు పరస్పరం మిత్రాలు. |
| 30. | ప్రత్యేక యతి | నామాంశంలోని అది - ఆడులకు స్వరమైత్రి. పిన్న + అది = పిన్నది; ఉన్న + వాడు — ఆడు = ఉన్నాడు. |
| 31. | భిన్నయతి | గురు విరహితంబులయి యయాంతంబులైన ఏకస్వర ద్విస్వరంబుల ఇంచుగ్వ్రకంబుల కియు డాగమంబు విభాషనగు - బాల - క్రి - 50. ఇంచుగాగమంలోని యడాగమానికి ఇకారంతో మైత్రి. ఇ = ధర్ + ఇంచు = ధరియించు. |
| 32. | పెఱయతి | ఇంచుగాగమ సంధికి స్వరమైత్రి. ఇ = హరించు. |
| 33. | ఏకతర యతి | రేఫ ఱకారాలు దేనికదే యతి- కాని అలఘురేఫ ము లుప్తాచ్కమగుచో లఘురేఫంబగు - ప్రౌఢ - నని-కనుక-జావడిపేర లాక్షణికులు వానిమైత్రి నంగీకరించిరి. |
| 34. | అభేదయతి | రలయోర్లడయో స్తద్వల్లళయో శ్శసయోరపి వబయోర్నణయోశ్చాంతే స్యాదభేదేన కల్పనమ్ రల - లడ-లళ-శస-వబ - నణ లకు పరస్పరం మైత్రి చెల్లును. |
| 35. | అభేద వర్గయతి | ''వబయోరభేదః'' అనే సూత్రం చేత-వకారానికి పవర్గం - అలాగే లకారానికి టవర్గం గూడ చెల్లవలె. |
| 36. | ఊష్మ విశ్రాంతి | శషసలు పరస్పరం మిత్రాలు. |
| 37. | సరసవళి | 1. అయహ 2. చఛజఝ శషస 3. నణలు. |
| 38. | సంయుక్త వళి | సంయుక్తాక్షరం యతి స్థానంలో ఉన్నపుడు దానిలో ఏదైనా ఒక అక్షరానికి యతి- క్ష్మ-క-ష - మ. పాదంలో పెక్కు యతులున్నపుడు సంయుక్తంలో అంతటా ఒకే అక్షరం తీసుకోవలె గాని ఒకచోట ఒకటి ఇంకొక చోట ఇంకొకటి కూడదు. |

39. అంతోష్మ సంధివళి — ఝయ్ కంటె పరమగు హకారమునకు వికల్పముగా పూర్వ సవర్ణ మాదేశమగును. వాగ్ + హరిః = వాగ్ఘరిః. ఈ సంధిలో పరుషాలకు గాని హకారానికి గాని యతి వేయవచ్చు.

40. వికల్ప విరమణం — పరుషముల కనునాసికము పరమగునపుడు వర్గానునాసికము వికల్పముగా వచ్చును. వాక్ + మయము = వాఙ్మయము, వాగ్మయము. ఈ సంధిలో పరుషాలకు లేదా అనునాసికాలకు యతి వేయవచ్చు.

ఈ క్రింది సంధులలో అచ్చులకు గాని హల్లులకు గాని యతి వేయవచ్చు.

41. యుష్మ దస్మచ్ఛబ్ద యతి యుష్మత్ + ఆజ్ఞ = యుష్మదాజ్ఞ.

42. పరాజపి యతి — పరా + ఆక్రమము = పరాక్రమము, పరా + ఇత = పరేత, అజ్ + ఉదక = ఓదక, అజ్ + ఉష్ణ = ఓష్ణమ్, అపి + అయ = అప్యయమ్.

43. ప్రాదియతి — ప్రాదులిరువది - వానికి అచ్చుపరమైనపుడు - ప్ర + ఆరంభ = ప్రారంభ, ప్ర + ఆన = ప్రాణ.

44. ఉపసర్గ సంధివళి — ఉపసర్గ ఉత్తర పదంగా ఉండి సంధి జరిగినపుడు వృషభ + అధిప = వృషభాధిప; స + అతిరిక్త = సాతిరిక్త.

45. అప్శబ్ద యతి — ఈ క్రింది వానికి అప్శబ్దము పరమగునేని యథా సంభవముగా అకారమునకు ఈ, ఊ ఆదేశములు వచ్చును. తత్స. సూ-650. ది + అప, ఈప = ద్వీప - అను + అప, ఊప = అనూప. ఈ శబ్దములో హల్లునకే గాక అచ్చులలో గూడ పరమైన వానికి, లేదా తరువాతి వానికి.

46. నఞ్ సమాసయతి — న + ఏక = అన్ + ఏక = అనేక; న + అక = నాక.

| | | |
|---|---|---|
| 47. | క్యజ్ ప్రత్యయాంత యతి | ఉపమానములైన అజంత హలంత కర్తృవాచకములకు కర్త్రర్థమున వర్తమాన, భూత, భవిష్యత్కాల భావార్థములందు ఆచారార్థమున క్రమముగా యమాన-యిత-యిష్యమాణ ప్రత్యయములు వికల్పముగా వచ్చును. అపుడు పూర్వాచ్చునకు దీర్ఘమగును. తత్స - సూ - 306. ఉపదేష్ట + యమాన = ఉపదేష్టాయ మాన - భద్ర + యిత = భద్రాయిత, వృధ్ + యిష్యమాణ = వర్ధిష్యమాణ. |
| 48 | ఘఞ్ యతి | భావార్థక ఘఞ్ ప్రత్యయము పరమగునేని అకారోపధ ధాతువులకు బహుళముగా ఉపధా దీర్ఘము వచ్చును. తత్స-సూ-189. రంజ్ + అ = రాగ, పచ్ + అ = పాక, భజ్ + అ = భాగ, |
| 49. | పృషోదరాది గణయతి | పృషోదరాదులు యథాప్రయుక్తముగ గ్రాహ్యములు. తత్స-సూ-692. పృషత్ + ఉదర = పృషోదర, ద్వి + ఆర = ద్వారమ్. |
| 50. | నిత్యసమాసవళి | అవిగ్రహో అస్వపద విగ్రహోవా నిత్యసమాసః. జన + అర్దన = జనార్దన, నార + అయన = నారాయణ. |
| 51. | దేశ్య నిత్య సమాసవళి | పైవి సంస్కృత నిత్యసమాసాలు, ఇవి దేశ్య నిత్యసమాసాలు. రూపు + అఱు = రూపఱు, ఉక్కు + అడచు = ఉక్కడచు. |
| 52. | తద్ధిత ప్రత్యయవళి - | విభక్త్యంతములపై భావార్థ మతుబర్థాదులందు విధింపబడు ప్రత్యయాలకు. నేర్పు + అరి = నేర్పరి, రజ్జుల + వాడు = రజ్జులాడు, సిగ్గు + ఇడి = సిగ్గిడి. |
| 53. | ఏవార్థక వడి | అ-ఎఏలు తెలుగులో ఏవార్థక ప్రత్యయాలు. మూలమీవు + అ = మీవ, బ్రహ్మమన నీవు + ఏ = నీవే. |

| | | |
|---|---|---|
| 54. | నిత్యయతి | చేదర్థకమైన ''ఏని''తో క్రియకు యోగమున్నచో సంధి నిత్యము. ఉండెను + ఏని = ఉండెనేని. |
| 55. | రాగమ సంధివళి | పేదాదుల కాలుశబ్దంబు పరంబగునపుడు కర్మధారయంబున రుగాగమంబగు-బాల-సం. 30. పేద + ఆలు, పేద + ర్ + ఆలు = పేదరాలు. ఇటులే టుగాగమ నుగాగమములకుగూడ చెల్లవలె. |
| 56. | విభాగవళి | మానార్థకంబులైన ఎడు - ఏసి - ప్రత్యయంబులు చేరునపుడు సంధినిత్యము. గంప + ఎడు = గంపెడు. చేర + ఎడు = చేరెడు- అవగాగమము గూడ దీనిలోనే చేరును. పది + అవ = పదవ. |
| 57. | నామాఖండవళి | నామంబులకు శ్లేషార్థంబులైన అన్నాదులు పరమగునపు డచ్చులకు సంధినిత్యము. కన్న + అప్ప = కన్నప్ప, దేవ + అరుసు = దేవరుసు. |
| 58. | విభక్తివిరతి | కయి–కు–కన్న–కంటె అను విభక్తుల కుభయ యతి. కు + అయి = కయి, కై, అగు = కు, కు + అన్న = కన్న, కు + అంటె = కంటె. (ఇవి కాలాంతరమున అఖండ పదములైనవి) |
| 59. | తత్సమక్రియావడి | ప్రాపు, ప్రేరేచు - మున్నగు తత్సమ క్రియల కుభయ యతి. ప్ర + ఆప్తి = ప్రాప్తి, ప్రాప్తించు -ప్రాపు. ప్ర + ఈరణ = ప్రేరణ, ప్రేరేచు. |
| 60. | అయవాదేశవళి | ఏచ్చులకు అచ్చులు పరమగునపుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అను నాదేశములు వచ్చును. నే + అనమ్ = నయనమ్, గో + అక్షమ్ = గవాక్షమ్, నై + అక = నాయక, పౌ + అక = పావక. |
| 61. | గుణాపవాదవృద్ధివళి | గుణ-పరరూప సంధులను నిషేధించి యేర్పడిన వృద్ధిసంధికి అచ్చు లేదా హల్లులకు యతి చెల్లుతుంది. స్వ + ఈర = స్వైర, అక్ష + ఊహిని = అక్షౌహిణి. |

| | | |
|---|---|---|
| 62 | ప్లుతయతి | మూడు మాత్రల కాలానికి ప్లుతమని పేరు. భీతి శోక తర్క గీత దూరాహ్వాన సంశయార్థాలలో ప్లుతం ఏర్పడుతుంది అపుడు దేనిపై ప్లుతం ఉంటే ఆ హల్లుకుగాని లేదా దాని అచ్చుకుగాని- కరుణింపరావే + ఏ = రావే!, నేరమ + ఆ = నేరమా! |
| 63. | ప్లుతయుగ విశ్రాంతి | పాదంలోని రెండు యతిస్థానాల్లో ప్లుతమే నిలిచితే ప్లుతయుగ విశ్రాంతి అనబడుతుంది. ఇది స్వర సంధి క్రిందనే లెక్క. |
| 64. | పరరూప విరతి | శకంధ్వాదులకు పరరూప మేకాదేశమగును. శక + అంధ = శకంధ, సార + అంగ = సారంగ. |
| 65. | గూఢవర్ణవళి | సంధిలో మరిగిపోయిన వర్ణానికి గూఢ యతి చెప్పవచ్చు. కుఱు + ఉసురు = కుట్టుసురు, నిర్ + సారము = నిస్సారము. |
| 66. | స్వరాభాసవడి | సవర్ణ దీర్ఘమువలె గనిపించు వాసవ, విశ్వావసు ప్రభృతులకు కొందరు స్వరయతిని వేసిరి. వాసవ - విశ్వావసు - విజ్ఞాపన. |
| 67. | లాక్షణికావ్యయవళి | అసమాపక క్రియలకు లాక్షణికావ్యయములని పేరు. వానికి చేరు ప్రత్యయముల కుభయయతి చెల్లును. ఒల్లు + అమి = ఒల్లమి, చేయు + అక = చేయక. |
| 68. | స్వర యతి | దేశ్యాలలోని అఖండ పదాలకు ఇది వర్తిస్తుంది. దేశ్యనిత్య సమాసాలలోనివి క్రియలు, దీనిలోనివి నామవాచకాలు. ఎల్లి + ఉండి = ఎల్లుండి, ఒక + ఒండు = ఒకొండు. |
| 69. | దేశీయ యతి | దేశ్యాలలో పరరూప సంధివలె కనిపించువానిని బట్టి యిది ఏర్పడింది. స్వరాభాసంలోనివి సంస్కృత నామాలైతే ఇవి దేశ్యాలు. తుమ్మెద, తెమ్మెర, (తెన్ + ఎర - తెమ్మ + ఎర) లేత (ఎల) |

70. అందదుకు వళి — అందదుకు ప్రభృతులు యథప్రయోగంబుగ గ్రాహ్యంబులు—బాల—సం. 42. అతుకు + అతుకు = అందదుకు.

71. అగ్రాహ్యసంబంధ వళి — అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు. బాల—ప్ర—13. డ—ణ.
దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు. బాల—ప్ర—14. ద—డ.

72. అగ్రాహ్యవర్గవళి — మకార, వకారమైత్రి. దీనిని "సంభావనావడి" యని కొందరు పాటించిరి - సామ్యోచ్చారణ ప్రాసలో (24) లాంఛన ప్రాయంగా దీని అంగీకారం కనిపిస్తుంది. జానపదులు "దేవుడు-దేముడు మామ-మావ" అని వీనిని మారుపాటు చేస్తుంటారు. మ - వ.

73. అగ్రాహ్య+అంతస్థవళి — యవరలకు సహజమైత్రి లేదు. బిందు పూర్వకాలై మైత్రిని పొందుతవి-ంయ-ంర-ంల-ంవ.

74. అగ్రాహ్య+ఊష్మవళి — బిందు పూర్వకమైన హకారానికి బిందు పూర్వకాలైన శషలు చెల్లుతవి. ంహ-ంశ, ంష, ంస,- అపుడివి అగ్రాహ్యంగావు. ఈ పద్యాలలో మాత్రం బిందువులు లేకుండానే చూపినాను.

75. ప్రాసయతి — పాదంలో రెండవ అక్షరానికి ప్రాస అని పేరు. యతి స్థానం నుండి మళ్లీ రెండవ అక్షరం కలిపితే ప్రాసయతి అంటారు. దీనికి హల్లేగాని అచ్చుమైత్రి అక్కరలేదు. ప్రాసనియమం ఉపజాతులకు మాత్రమే ఉంది నిగ్గమ-జగ్గతి

* * * *

సంధి-సమాస-కృత్తద్ధితాలు బాగా రూఢిలో ఉన్నవారికి ఈ రంగం ఇంకా విశాలమై ఎన్నో విశేషాలు గోచరిస్తవి.

---

ప్రాస—ప్రకృష్ట వర్ణవిన్యాసో ప్రాసః.

ప్రాసకు అచ్చు మైత్రి అక్కరలేదు. కాని ఏ అక్షరానికి ఆ అక్షరమే ఉండవలె మరొకటి పనికిరాదు.

| | | |
|---|---|---|
| 1. | ఖండబిందు ప్రాస | ఖండబిందు పూర్వానికి ఖండబిందుపూర్వకవర్ణం. పాఁడి-నాఁడు. |
| 2 | పూర్ణబిందు ప్రాస | పూర్ణబిందు పూర్వకానికి పూర్ణబిందు పూర్వక వర్ణం. దండు-గుండె-ఉండు-నిండ. |
| 3. | ఖండాఖండ బిందుప్రాస | పీఠ = పీఁట, పూగ = పోఁక అని ప్రకృతులందు లేని బిందువు వికృతులందు జూపట్టెడి-రూపి-పు-9. గాన ఇది అంగీకారంగావచ్చు—తీపి-కాఁపు-దాఁపు-చూపు. |
| 4. | ఖండపూర్ణబిందుప్రాస | నిండుసున్న గలదానికి అరసున్న గల అక్షరం. కాంచు-ఊఁచ;తాండవ—నాఁడు. |
| 5. | సంయుతాక్షర ప్రాస | ఏవత్తు గలదానికి ఆవత్తు గల అక్షరం. శర్వ-ఉర్వి-తక్కువ-నిక్కము. |
| 6. | సంయుతాసంయుతప్రాస | సంయుక్తాక్షరానికి అసంయుక్తాక్షరం. తంద్రి-ఉండు;ఏండ్లు-ఉండు. (ఈ సంశ్లిష్టాలు కేవలం రేఫలకారాలకే పరిమితం) |
| 7. | సంయుక్తవ్యత్యయప్రాస | సంయుక్తాలు తారుమారైన అక్షరాల ప్రాస. వర్గ-ఉగ్ర;వర్తిలు-చిత్రము. |
| 8. | వలపల గిలక ప్రాస | వలపల గిలకకు ద్విత్వాక్షరానికి ప్రాస. సవఌ-నివ్వ-ఉవిఌ-నొవ్వు. |
| 9. | క్షప్రాస | సంయుక్త క్షకారానికి అసంయుక్త క్షకారం. (6వ దానివలె) లక్ష్యము-అక్షయ.(ఇది క్షకారానికే పరిమితం). |

10. సంయుక్త విశేష ప్రాస రెండేసి వత్తులుగలదానికి ఒక వత్తుగల అక్షరం.
దృక్క్రియ-శక్తి;సత్క్రియ-చక్రి.

11. రేఫయుత ప్రాస ఋవడి రావడి గల అక్షరాలకు ప్రాస.
ప్రాకృత-ప్రక్రియ.

12. లఘుద్విత్వ ప్రాస క్రావడితో గురు లఘువులయ్యే అక్షరాలకు ప్రాస.
చక్వరక రు వర్ణంబునకు ముందరి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు; అగుచో దత్పూర్వ స్వరంబు గురువుగాదు-బాల. ప్ర. 20.
అద్రి-అద్రుచు.

13. వికల్పప్రాస సూ. చూ. వికల్ప విరమణం. 38.
ప్రాజ్ఞియమ-అగ్ని-జన్మము-సద్మము.

14. ఉభయప్రాస వ్యాకరణ సూత్రాలచేత ఆదేశమైన షకార ణకారాలకు సహజమైన షకార ణకారాలకు మైత్రి.
ప్రాణము-మానము;విషయము-వ్యసనము.

15. ప్రాస మైత్రి ప్రాస బిందు పూర్వక బకారానికి ద్విత్వ మకారానికి ప్రాస; మువర్ణమునకు మాముడియేని పూర్ణబిందు పూర్వకబువర్ణంబేనివిభాషనగు-బాల-తత్స-42.
అంబుజాసన-నెమ్మి-అంబిక-సమ్మద.

16. అనునాసిక ప్రాస ద్విత్వాలైన నకార మకారాలు పూర్ణబిందు పూర్వక నకార మకారాలకు-
మిన్నేరు-ధాతంనాభిన్;నంమొనసి-తమ్మి

17. ఉభయానునాసికప్రాస జ-ఞ-ణ న-నమ ప్రాసయతిలో చెల్లుతవి నణలు మాత్రం ప్రాసయతిలో గూడ నిలుస్తవి.
యజ్ఞ-శార్ఙ్గము;గుణ-ముని-

18. ఋప్రాస పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు రల తుల్యంబులు బాల-ప్ర-1. కాన ఋరలకు ప్రాస అంగీకరింప బడింది. ఏఋతము-నేరుగ.

19. వైర ప్రాస ర- ఱ- ప్రాస. సంయుక్తమున శకట రేఫము లఘు రేఫంబగు- కాబట్టి ఆధునికులు వీటిని యతి ప్రాసలలో మిత్రాలుగా అంగీకరించినారు. దారి-జాఱు;సూరి-ఏపాఱు.

20. స్వవర్గజ ప్రాస — ద ధలు - థ ధలు - ఏకవర్గజాలు. కాబట్టి ప్రాస మైత్రి అంగీకరింప బడింది. గ్రంథము - మంద రము. ఇదే విధంగా ఖ ఘ లకు ఫ భ లకు గూడ చెల్లవలె.

21. లఘు యకార ప్రాస — య ర ల వలు లఘువులు అలఘువులని ద్వివిధం బులగు - బాల - సం. 18. ఆగమ యకారము లఘువు తక్కిన వకార మలఘువు. ఆదేశ వకా రము లఘువు తక్కిన వకార మలఘువు. ఈ లఘువులకు అలఘువులకు యతి ప్రాసలలో మైత్రి అంగీకరింప బడింది. నీయడుగు - కాయము, ఆవిడప - దేవ.

22. అభేద ప్రాస — బహువచనము పరంబగు నపుడు...... డలరల కలఘు లకారంబు బహుళంబుగా నగు - బాల - అచ్చి - 13. డళ - లళ - రళ - లకు ప్రాస మైత్రి చెల్లుతుంది. లీల-వేళ; పీడు-కూళ.

23. సంధిగత ప్రాస — తెలుగు సంధులలో ప్రథమపై వచ్చు స-వళ్లు, ద్రుతం పైన వచ్చే సరళాలు సహజ వర్ణాలకు చెల్లుతవి. రంజిత - ంజనగ; పొందిక - ందగగ.

24. సామ్యోచ్చారణ ప్రాస — సింహ - గహ్వర; యౌవన - నివ్వటిలు-వంటి శబ్దాలుచ్చారణలో అభేదంగా కనిపిస్తవి గాబట్టి కొందరు ప్రాసలో కూర్చినారు.

25. రూపాంతర ప్రాస — అపదాద్యంబయి అసంయుక్తం బయిన గకారం బునకు వకారంబుని భాషనగు - బాల-అచ్చి-27. జూదాదుల దాకు జకారంబు విభాషనగు - బాల-ప్ర. 21. తెలుగున లకారము నకారముగా మారుట పెక్కుచోటులం దగుపడు - బాల-దూసి-పు. 9. పైవాని ప్రకారం "గవ-జద-లన-"లు గూడ ప్రాసమైత్రి నందవలె.

* * *

# ఆకరాలు

బాల- బాలవ్యాకరణం - దూసివ్యాఖ్య.
తత్స- తత్సమ చంద్రిక - సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు.
తె-చం. తెలుగులో ఛందోరీతులు - రావూరి దొరసామి శర్మగారు.

-: ప్రాస మైత్రి పట్టిక :-

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఋ | ర | ద | ఁడ | ండ | త్ర్క | క్ష్య | జ్ఞ | ంహ |
| రి | ల | ధ | ండ | ంట | క్ర | క్ష | గ్న | హ్వ |
| ర | ళ | థ | ద్ర | న్మ | కృ | ర్గ | న | వఁ |
| ఱ | డ | ధ | డ్ల | ద్మ | క్రు | గ్ర | ణ | వ్వ |

ప్రాస తెలుగు పద్యానికి పెట్టని సొమ్ము. అది ఎంతగా చక్కగా చెల్లిస్తే పద్యం అంత సొగసుగా కనిపిస్తుంది.

* * * *

యోగివర ! నీ ముఖాబ్జాల శ్రీవిమీర
గా జనించిన వంశాల పాదుకో క
నీయుడను నీదుపేరిటి యోజును సతి
వలన నను సుందరేశ్వరు డనిరి బుధులు.

జ్ఞాన చక్షుడు గాను-శార్ఙ్గధర వినుత
ఖేంద్రవాహన మీరూప ఖ్యాప్సచేత
నూపురాల్ జేసితిని గుణ జోతలుగను
జాపయిత మీకు పాదార్ప ణమ్మనుచును.

వీని నావిష్కరించెను మీసరముగ
లోక దళ నాయకుఁడు సుగుణుఁడు హితవరి
మల్లెపల్లి మాధవరెడ్డి ప్రకటన పతి
సుతుని కల్యాణ సమయాన సుషమ వేళ.

బలభిన్మణి- మా రమణుడు కిన్నరపతి సఖుకున్
వారిజభవుడున్ శతముఖుడును సం
సార కరుడు సంయమి నికరము సం
స్సార మిడుత సం పతితల కెప్పుడున్.

| ఉన్నవి | ఉండవలసినవి | ప. సంఖ్య | పేజి నం. |
|---|---|---|---|
| నెవరి | యెవరి | 27 | 6 |
| యాతని | యతని | 67 | 14 |
| మెంచితమ్మ | యెంచితమ్మ | 72 | 15 |
| బలుగు | బలుకు | 82 | 17 |
| కలుగు | కలగు | 102 | 22 |
| సమంబు | సుమంబు | 105 | 22 |
| అబ్బ | అబ్జ | 6 | 25 |
| సిల్ప్రితివి | నిల్ప్రితి | 7 | 25 |
| పఱపు | పఱుపు | 8 | 25 |
| చుండు | చుందు | 11 | 26 |
| ఇచ్చ | ఇట్చర | 22 | 28 |
| సవర్గ | సవర్ణ | 28 | 30 |
| దుష్ట | దుష్ప | 30 | 30 |
| దనుట | దనుజ | 30 | 30 |
| విడడు | మిడడు | 51 | 34 |
| అవ్యయు | అప్యయు | 59 | 36 |
| పరాజ్ఞయతి | పరాజ్ఞపి యతి | 59 | 36 |
| ఉపసర్గవళి | ఉపసర్గసంధివళి | 61 | 36 |
| క్రజ్ ప్రత్యయాత | క్యఙ్ ప్రత్యయాంత | 64 | 36 |
| ఘజ్ యతి | ఘఞ్ యతి | 65 | 36 |
| అయవదేశ | అయవాదేశ | 77 | 39 |
| లక్షణిక | లాక్షణికావ్యయ | 84 | 41 |
| ప్రశాస్తి | ప్రశాస్త్ర | 95 | 43 |
| పూండ్లైన | పూండ్లైన | 96 | 43 |
| నెమ్మి | యిమ్ము | 102 | 44 |
| ఇర్జ్గ | శార్ఙ్గ | 103 | 45 |